గ్రహించుటేగాని, పదములను తనకుతోచిన ప్రమాణముతో ఎంచి, నిఘంటువులోని కెక్కించుట కాదను ప్రాథమిక సూత్రము నాతడు గ్రహించెను. కనుకనే మామిడి వెంకయ్య 1816 లో రచింపగా 1848 లో అచ్చయిన ఆంధ్రదీపికను గూర్చి వ్రాయుచు నందు కావ్యభాషకు గాని వ్యావహారిక భాషకు స్థానము లేదని వ్రాసెను.[40] తన నిఘంటువులలో, సాధ్యమైనంతవరకు, కావ్యభాష వ్యావహారిక భాష యను భేదము లేకుండ పదములను చేర్చెను. ఇది అసామాన్యమైనది.

నిఘంటువులో వివిధశాస్త్రములకు సంబంధించిన పదము లుండవలెనని, ఆ యా శాస్త్రగ్రంథములను శోధించి యాయా పదములను తన నిఘంటువులలో చేర్చుకొనెను. ఈ పదములలో కొన్ని నాటి పండితులకే తెలియవట.[41] నిఘంటువు సాధ్యమైనంతవరకు సంపూర్ణముగ నుండవలెనని యాతని పట్టుదల. నిఘంటు నిర్మాణములో నాత డనుసరించిన ఈ మార్గములనే తరువాతివా రనుసరింప జూచిరి. వారలపై నాతని ప్రభావమది.

తనకు పూర్వముగల దేశీయులు వ్రాసిన. విదేశీయులు వ్రాసిన, నిఘంటుల నన్నింటిని పరిశోధించి తనకు గావలసిన సామగ్రిని కూర్చుకొనెను. తాను స్వయముగ చదివిన గ్రంథములనుండి మాటలను గ్రహించెను.[42] నిఘంటువులలో సందిగ్ధమైనది, ఋజువుకానిది ఏదియును నుండకూడదను దృష్టితో

40. "The Dipica ఆంధ్ర దీపిక. A dictionary of Telugu explained in Telugu written by మామిడి వెంకయ్య at Masulipatam. It was completed in the year 1816. A duodecimo edition of this book was printed at Madras in 1848: but is far from faithful. The Dipica gives a mere selection of the words used in Telugu poetry. eTh ordinary Telugu of common life is but slightly noticed." (C. P. Brown's Telugu - English Dictionary, 1852. Page VIII)

41. "Some Telugu words which I have copied from the glossaries marked A B A(ఆంధ్రభాషార్ణవము) or Kark: (కర్ణాంబాడి) or Q (క్వాథశాస్త్రం) are unknown to learned natives." (Ibidem - Page - XIII)

42. "There are from ten to twenty quotations from Telugu authors, in each page. This part of the work was executed by my own pen ; my learned and laborious assistants transcribed them for the press, but seldom supplied one from their own reading." (Some account of the Literary life of C. P. Brown)

మాటల యుపయోగమునకు దా నిచ్చు ప్రయోగముల నన్నింటిని మూల గ్రంథములతో సరిచూచి, వానిని నిర్ణీత స్థానములలో నుంచెను.[43] ఇట్లు చేయుట ఆతని కృషి యొక్క ప్రభావమే.

తన నిఘంటువులు పండిత పామర రంజకములుగ నుండవలెనను దృష్టితో నాతడు ప్రజల భాషను, కావ్యభాషను గూడ తన నిఘంటువులో (తెలుగు-ఇంగ్లీషు) సమముగ నాదరించెనని వ్రాసితిని. ఇట్లు చేయుటయే గాక, తనకు సమకాలికులైన శిష్టుల రచనలలోనుండి-పదముల కర్థవివరణము చేయునపుడు-ఉదాహరణలను గ్రహించి; శిష్టజన వ్యావహారికమును పరిగ్రహింప నగునను నవీనులకు దారి చూపెను. దీని కుదాహరణముగ, బ్రౌనుదొరగారి మిత్రులైన ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర' నుండి బ్రౌనుదొర యుదాహరణలను గ్రహించుటను చూపవచ్చును.[44]

"ఇంద్రాణి—Name of the wife of Indra; A sort of bracelet, Orangallu glossary; 'Dowager' a Bramin widow, Enugula. 28th July 1830."

"పలవర—The name of a certain tree much cultivated in the neighbourhood of Hyderabad for its fruit. పలవర ఆకులు its leaves, are used to manure land. See description in the Kasiyatra, date 7th September 1830."

జీవద్భాషకు శాశ్వతమైన నిఘంటువనునది యుండదనియు, వ్యాకరణము నట్లేయనియు, గ్రహించినవాడగుటచే, తాను భారతదేశమును విడిచి వెడలిపోయిన (1855) తరువాతను; నిఘంటువులోను, వ్యాకరణములోను మార్పులు చేయుచునే యుండెను[45].

ఆతడు తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులో పదములను; అకారాదిగ అచ్చులను కూర్చినను, హల్లుల విషయములో ఒక క్రొత్తమార్గమును త్రొక్కెను. సాధారణముగా అకారాది నిఘంటువులలో, హల్లులతో ప్రారంభించు పద

43. More than one hundred Telugu authors were quoted, every quotation was to be verified, transcribed and inserted." (Ibidem)

44. Telugu - English Dictionary. (Pages 80, 564)

45. "I dialy made additions in the Dictionaries, and the Grammar, which are now more than doubled." ('Some account of the Literary life of C. P. Brown')

ములును అచ్చుల క్రమము ననుసరించుచు, వరుసగానుండుట మనకు తెలిసినదే (క, కా, కి, కీ, మొ.). ఈ విధముగా ఒక వర్గముతరువాత నింకొకవర్గము వచ్చుట పరిపాటి. ఈ పద్ధతిని విసర్జించి; ఒక వర్గములోని వివిధాక్షరములతో- అనునాసికాక్షరములను విడిచి-ప్రారంభించు పదజాలమునంతయు, అకారాదిగ నొకచోటనే ఇచ్చు క్రొత్తపద్ధతిని బ్రౌనుదొర ప్రారంభించెను[46]. య, ర, ల, వ లు వేరుగనే కలవు. మరలి శ, ష, స లను కలిపినాడు. ఇందువలన కోత, గోత్రము, ఘోషి మొదలగు పదములు ఒకదానితరువాత నొకటి ఒకే శీర్షిక క్రింద-కో, గో, ఘో-వచ్చినవి[47]. అటులనే - జిగి, చిగురు, జిఘాంసుడు మొదలగునవియు; శాతము, షాడబము, సాతాని మొదలగు పదములును వచ్చినవి[48]. ఈ యుదాహరణలవలెనే మిగిలినవియు గ్రహింపవచ్చును[49]. బ్రౌనుదొరకు ముందుగాని వెనుకగాని ఈ పద్ధతి లేదు. సామాన్య నిఘంటువులలో 'క' వర్ణముతోగూడిన అన్ని యచ్చులు ప్రారంభముగ గల మాటలు ముగిసినగాని, 'గ' వర్ణము రాదు. ఇందట్లుగాదు ఈ మార్పువలన నిఘంటువు నుపయోగించుకొనుట సులువగు ననియు, నాటి పండితులలో చాలమంది తన పనిని మెచ్చిరనియు బ్రౌనుదొర వ్రాసెను[50].

ఈ మార్పును తరువాతి నైఘంటికులు హర్షింపక విమర్శించి, విసర్జించి నను బ్రౌనుదొర నిఘంటువునుమాత్రము, తాము నిఘంటువులు కూర్చునపుడు

46. క ఖ గ ఘ, కా ఖా గా ఘా, కి ఖి గి ఘి, కీ ఖీ గీ ఘీ మొదలగునవి.

47. Telugu - English Dictionary 1852 ; Page - 287.

48. Ibidem. Page - 330.

49. Ibidem. Page - 1050

50. "I have made an improved arrangement of the consecutive initial consonants : Uniting such as in Telugu are commutable. Few Sanscrit words are affected by this principle.....Words beginning with D might at pleasure begin with T. 'Dova' and 'Tova' equally mean a road......From this uncertainity the learned seldom relieved me : on being asked, they often reply that either spelling may be used. At last I removed the uncertainity by transcribing the Dictionary, when nearly half complete, and mingling those initials which are changeable......Every man who makes real progress in Telugu will I think see the value of the present arrangement......In composing this work I have had the approbation of my learned assistants." (Ibidem - Preface IV, V)

వినియోగించుకొనిరి. శంకరనారాయణుని[51] నిఘంటువులు, బహుజనపల్లి సీతారామాచార్యుల 'శబ్దరత్నాకరము' బ్రౌణ్య నిఘంటువులపై చాల నాధారపడినవి. శబ్దరత్నాకరము 1885 లో మొట్టమొదట ముద్రింపబడినది. దీనికి బ్రౌణ్య నిఘంటువులు చాల సాయముచేసెను. ఈ విషయమును గూర్చి బహుజనపల్లి వా రిట్లు వ్రాసిరి. "తెనుఁగున వాడుకలోనికి వచ్చిన యన్యదేశీయ శబ్దములు కొన్ని యీ క్రొత్త కూర్పునందుఁ జేర్పఁబడినవి. బ్రౌణ్య నిఘంటువులోనుండి యిట్టి శబ్దములు కొన్ని చేర్పఁబడినవి."[52]

క్రొత్త కూర్పునకే గాక, అసలు నిఘంటు నిర్మాణమునకే బ్రౌణ్య నిఘంటువులు తోడ్పడినవని; శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు కంఠోక్తిగ, "శబ్దరత్నాకరమునకు బ్రౌణ్య నిఘంటువే ఆధారము" అని చెప్పిరి.[53] శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాతలును బ్రౌణ్య నిఘంటువును ప్రమాణముగ స్వీకరించి, అంగీకరించిరి.[54]

బ్రౌనుదొర కూర్చిన ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు, ఆతని తెలుగు-ఇంగ్లీషు నిఘంటువునకు తోబుట్టువు. ఈ నిఘంటువును కూర్చుటలో ఆతని ముఖ్యోద్దేశము, ఆంగ్ల సాహిత్యమును హిందువులకు సులువగునట్లు చేయుట. ఈ విషయమై యాతడిట్లు వ్రాసెను, "This work may render English

---

51. శంకరనారాయణ తన ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో, 'On the contrasts between English and the Indian vernaculars and a Common alphabet for the different languages of India' అను శీర్షికక్రింద వ్రాయుచు బ్రౌనుదొర వ్యావహారికభాష నంగీకరించుటను, నవ్య వర్ణక్రమపద్ధతిని నిఘంటువులో ప్రవేశపెట్టుటను, విమర్శించెను.

కాని భాషనేర్చుకొనువానిని మనస్సులోనుంచుకొని బ్రౌనుదొర తన నిఘంటువును వ్రాసినాడనుదానిని మనసులోనుంచుకొన్నచో ఈ విమర్శ అనావశ్యకము. బ్రౌనుదొరయే, 'Should any future editor prefer separating the commutable letters, this can easily be done; but it will inconvenience the learner'', అని వ్రాసెను.

(Quotation from 'T-E-D. Preface-Page-IV.)

52. శబ్దరత్నాకరము. 1937. నియమ విధానక్రమము. XX.

53. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు - విమర్శనము (12-7-1939) కళాప్రపూర్ణ శ్రీ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు.

ఈ వ్యాసము శ్రీవారి స్మారక సంచికగ వెలువడిన 'ప్రతిభ', సంపుటి 4లో పునర్ముద్రితము. అందీ వాక్యము 41 వ పేజీలో గలదు.

54. "ఈ నిఘంటు నిర్మాతలు బ్రౌణ్య నిఘంటువు ప్రమాణముగ స్వీకరించినారు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను" (Ibidem Page-20.)

literature accessible to all the Hindus who fill the Indian Peninsula."[55] ఆంగ్లభాషను భారతీయులు, భారతీయ భాషలను ఆంగ్లేయులు నేర్చుకొనని నాడు పరస్పరము కలిసి పనిచేయుట పొసగదని యాతని విశ్వాసము. ఆనాడెందరో తెలుగువారు దీని ప్రాభవమున ఆంగ్ల భాష నభ్యసించి యుందురనుటలో సందేహములేదు.

ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో; పదముల కర్థవివరణము చేయునప్పుడు, ఆంగ్ల పదముల పూర్ణార్థము తెలుగువారికి పూర్తిగ స్ఫురించుటకై, తెలుగు సాహిత్యములోనుండి యుదాహరణ లిచ్చి చూపెను. ఇంత వివరణమాంగ్లేయుల కక్కరలేకున్నను, 'హిందువుల' కై తాను చేసినట్లు బ్రౌను దొర యిట్లు వ్రాసెను. "Writing particularly to assist Hindus, I have given some minute explanations which Englishmen may deem superfluous. But to the Hindu they are advantageous. Elsewhere (as under the word Humour) I have alluded to such Telugu authors and phrases as seemed useful."[56] ఇంత దూరదృష్టిలో కృషిచేసెను గనుకనే బ్రౌనుదొర కృషి ఫలితము ఆంధ్ర సాహిత్యములో నంతర్లీనమైయున్నది.

ఆంధ్రభాషలో, పాశ్చాత్యుల సంపర్కమువలన, వచ్చి చేరిన అన్యదేశ్యములను గుర్తించి, తన నిఘంటువులో వానికి స్థానమిచ్చి, అన్యదేశ్యములకు తెలుగు పదజాలములో గల స్థానమును గూర్చి ఇట్లు వ్రాసెను.

"Under the Musalman rule, Telugu, Kannadi and Tamil were filled with Arabic words. At present these are retained and many English expressions are added. ....At present the Telugu used in conversation and business is becoming more and more thickly sprinkled with English words"[57]

---

55. 'Some account of the Literary life of C. P. Brown'.

56. Engiish-Telugu Dictionary, 1852 (Preface-Page 5)

"Humour—(Ibidem page-583); Humorous adj. కుచోద్యమైన, కుత్సితమైన, చపలమైన, వింతైన, విపరీతమైన, సరసమైన, హాస్యమైన. Tennala Ramalinga was a humorous poet. తెన్నాల రామలింగడు కుచోద్యమైన కవి. Many verses in Vemana are humorous వేమనలో కొన్ని యెగతాళి పద్యములు వున్నవి, అనగా లోకవిరుద్ధములు.

Humour n. s. moisture తడి, తేమ, ద్రవము........Calidasa was a man of elegant humour సరసుడు. Narada was an ill-natured man though very good-humoured. నారదుడు సరసుడైనప్పటికిన్ని దుస్స్వభావము గలవాడు. Bhojaraja was good-humoured and good-natured భోజరాజు శాంతుడున్ను వుపకారియున్ను........"

57. I bidem. Page 5. Preface.

మన వైయాకరణులును అన్యదేశ్యములను గుర్తించినను, ఆంగ్ల శబ్దములను గుర్తించు విషయమై వెనుకంజ వేయుచుండగా; ఆంగ్ల పదములను. ఫార్సీ, అరబ్బీ, హిందూస్థానీ పదములవంటివేయని చూపి తన 'మాటబలము'ను తోడిచ్చి వ్రాసిన బ్రౌనుదొర ప్రభావము సామాన్యము కాదు. ఇట్లాంగ్ల పదములకు ఆంధ్రభాషలో స్థానము గలదని గుర్తించిన బ్రౌనుదొరయే, ఆ పదములు దేశీయుల అనుమతి పొందినపుడే తెలుగు భాషలోని భాగములగుననియు, క్రొత్త పదములను సృష్టించి భాష కిచ్చు నధికారము కవులకే గాని, విదేశీయులకు లేదనియు స్పష్టముగ వ్రాసి, భాషాభివృద్ధియొక్క మార్గమునకు సంబంధించిన, ప్రాథమిక సూత్రమును, తన తోటి పాశ్చాత్యులకు తెల్పెను.[58]

ఇంగ్లీషు-తెలుగు; తెలుగు-ఇంగ్లీషు బ్రౌణ్య నిఘంటువుల తరువాత చెప్పుకొనదగిన ఆతని నిఘంటువు 'మిశ్రభాషా నిఘంటువు'. (A Dictionary of the Mixed Dialects and foreign words used in Telugu—1854) ఈ నిఘంటువు మిగిలిన నిఘంటువులకంటె విశిష్టమైనది. ఈ నిఘంటువును కూర్చుటకు యత్నించుటలోనే ఆతని ప్రత్యేకతయు, ప్రతిభయు కనబడును. ఇట్టి నిఘంటువున కావశ్యకత కలదని యూహించుట సామాన్య విషయము కాదు. ఈ నిఘంటువు తన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువునకు పరిశిష్టమువంటిదనియు, సాధారణముగా తెలుగుప్రజలు వాడుచున్న అన్యదేశ్యము లిందు కలవనియు బ్రౌనుదొర వ్రాసెను.[59] తరువాత నిఘంటువులు కూర్చినవా రందరును దీనినుండి మాటలను గ్రహించిరి.[60]

న్యాయస్థానములలోను, వాణిజ్య కేంద్రములందును మిశ్రభాష విశేషముగ వాడబడుచున్నది గనుక దానికి భాషలో నొకస్థానము గలదని వ్రాయుచు,

---

58. "....But I have avoided all fabricated words and meanings: I have never admitted a new Telugu phrase without duly warning the reader. To coin a new phrase is easy: but no foreigner has the power to give it currency. I am not one of those who fancy that we can alter or improve the languages used in India." (Ibidem. Page 5. Preface)

59. ".....forms a requisite supplement to a Dictionary of the Telugu Language: and it contains only those phrases which are curr ent among the natives."

(Dictionary of Mixed Telugu, 1854. Preface; Page III)

60. దీనికై (52) Foot Note చూడుడు.

ఆ భాషకొక యుదాహరణ మిచ్చెను. "ఈ సంబదు లో డెఫెండంటు సమ్మను చూచి సైను (or దస్కత్) చేసి వాయిదా చొప్పున కోర్టులో హాజరు అయి ఆన్సరు యియ్యకపోయినందున యిందులో యెక్సపార్టి దర్యాప్తు చేయవలెనని ప్లెంటిఫ్ ప్లీడరు మోశను చేసినాడు గనుక ఆ మోశను రికార్డు లో దాఖలు (or ఫయిలు) చేసి అందులో దర్ఖాస్తు చేసిన చొప్పున నడిపించే లాగున ప్రొసీడింగసు లో ఆర్డరు యెంటరు చేయడం అయినది"[61]

పై విధములుగా భాషాభ్యాసమునకు —- దేశీయములైనను, విదేశీయములైనను—ప్రాణములైన నిఘంటువులను సర్వతోముఖ ప్రతిభతో కూర్చి, ఆంధ్రభాషా సాహిత్య రంగములపై తన ప్రభావము బ్రౌనుదొర చూపెను.

ఆంధ్రభాష నేర్చుకొనగోరువారికిని ఆంగ్లము నేర్చుకొనగోరువారికిని సమముగనే యుపయోగించు నాతని నిఘంటువులను పేర్కొనినతరువాత; నాతని వ్యాకరణమును, వాచకములను పేర్కొననగును. ఆతని వ్యాకరణము 1840 లో తొలికూర్పు పడెను. మలికూర్పు 1857 లో. వ్యాకరణరచనలోను బ్రౌనుదొర క్రొత్తమార్గము త్రొక్కెను. ఆతని తరువాత తెలుగు వ్యాకరణములు 'ఇంగ్లీషు గ్రామరు' పద్ధతిని వ్రాసిన వారందరును, ఇంచుమించుగా బ్రౌనుదొర తెలుగు వ్యాకరణ పద్ధతి ననుసరించి రనుటలో విప్రతిపత్తి లేదు. తెలుగుభాషను చదువు తెలుగువారును ఇప్పుడు బ్రౌనుదొర మొదలైనవారు చెప్పిన పాశ్చాత్య పద్ధతినే అనుసరించుచున్నారన్న, ఆనాటి పాశ్చాత్యుల కృషి ప్రభావము మనపై నెంత గలదో తెలియును.

నాటి పండితులు ముందు పద్య కావ్యములతో ఎవరికైనను—దేశీయ విదేశీయులలో—విద్య ప్రారంభించెడివారు. నిఘంటువులను కంఠస్థము చేయుమనెడివారు. వ్యావహారిక భాషనుగూర్చి చెప్పెడివారు కారు. ఇందువలన ప్రారంభకునకు లాభము తక్కువనియు, కనుకనే తాను వారు (పండితులు) ముందు ప్రారంభించు విషయములను తుదను చేర్చితిననియు తన వ్యాకరణ విషయమై బ్రౌనుదొర వ్రాసెను.[62]

---

61. Dictionary of Mixed Telugu, 1854. Preface; Page-III. ఈ వాక్యములు మచిలీపట్టణము 'పోర్టు జర్నలు' నుండి గ్రహింపబడెను.

62. "......they counsel us to learn, as they do, long Vocabularies by rote..........." (A Grammar of the Telugu Language. Page-V)

తెలుగు చదువుకొనుటకు ప్రారంభించిన తరువాత కొద్ది కాలమునాటికే, పండితులు ప్రారంభకుల కనావశ్యకములయిన విషయములను చెప్పుటకు ప్రారంభించినచో, 'తెలుగు మున్షీ'లచే ఈ వాక్యములు చదివింపవలెనని బ్రౌనుదొర తన తెలుగు వ్యాకరణములో నిట్లు వ్రాసెను.[63]

"ఇంగిలీషువారు ఆంధ్రము చదవ నారంభించేటప్పుడు కేవలం సంస్కార దూరులై వున్నారు గనుక శబ్ద పరిచ్ఛేదం, క్రియా పరిచ్ఛేదం, మాత్రము తొలుత నేర్చుకోవలసినదే గాని కళ - ద్రుతం - సంధి - సరళాదేశం - తద్భవం - తత్సమం - దేశ్యం యిత్యాది ప్రమేయములనుగురించి ప్రస్తుతం తలపెట్ట పనేలేదు.— యీ హేతువు వల్లనే యీ ప్రమేయములు యీ వ్యాకరణములో ఆదిభాగములో వ్రాయక అంత్యభాగములో వ్రాయడ మైనది. పైగా ఆరంభములో పద్యాలు చదవడము అన్నివిధాలా నిష్ఫలము గనక తొలుత అర్జీలు - జాబులు - వాజ్మూలములు - గాక మరి యేదిన్ని చదవ నగత్యములేదు."

పైవిధముగ తెలుగు నభ్యసించుటలో సౌలభ్యము గలదు గనుక, తెలుగువారికై తెలుగువారు వ్రాసిన తెలుగు వ్యాకరణములును ఈ మార్గమునే త్రొక్కి, ఆంగ్ల వ్యాకరణ పద్ధతిని తెలుగునకు తెచ్చెను. కొన్ని తెలుగు వ్యాకరణములు పూర్తిగ నీ పద్ధతి నవలంబింపకున్నను, కొన్ని పద్ధతులను మాత్రము స్వాయత్తముగ చేసికొనెను. పాశ్చాత్యులు-ముఖ్యముగ బ్రౌను- వ్రాసిన వ్యాకరణములు తెలుగు వ్యాకరణములపై నీ ప్రభావమును జూపెను.

కావ్యభాషకేగాక వ్యావహారిక భాషకును వ్యాకరణమున తావు కలదని వాదించి, నేటి వ్యావహారిక భాషావాదులకు పాశ్చాత్యులు-

"Native tutors urge us first to learn the very subjects which I have placed at the end of the work." (Ibid. Page-IV)

"Hitherto every path was overgrown with gay weeds of pedantry which I have cleared away" (Ibid. Page-VI)

63. "The ordinary teachers are apt to speak to students on some learned subjects which are ill suited to beginners. The tutor should on such occassions be desired to read the following caution." (Ibidem. Book First ; Page-32)

ఈ వాక్యముల క్రింద "ఇంగిలీషువారు ఆంధ్రము చదవ నారంభించేటప్పుడు........" అను వాక్యములు కలవు.

ముఖ్యముగా బ్రౌను దొర-[64] దారి చూపిరి. వీరూహింపలేనంతగా వారికి ఋణపడి యుండిరి.

బ్రౌనుదొర, గ్రంథములను రెండుద్దేశములను మనస్సులో నుంచుకొని వ్రాసెను. తన గ్రంథములు - తెలుగువారికి ఆంగ్లమును, పాశ్చాత్యులకు తెలుగును, నేర్చుకొనుటకు వీలుగనుండవలె ననునవియే ఆ యుద్దేశములు, కనుక నిఘంటువులు మొదలైనవానిలో; పాశ్చాత్యులు పునరుక్తియని గాని, అనావశ్యకమని గాని తలంచు వానిని తెలుగువారి సాయమునకై యుంచెను. అంతియెగాక, వానిలో ఆంగ్లము నేర్చుకొనగోరు తెలుగువారికి మాత్రమే వలసిన విషయమును గూడ, గ్రంథారంభమున ముద్రించెను. ఈ విషయము నాతడే యిట్లు తెల్పెను.

"At the request of some Telugu friends I have reprinted a system of English pronunciation: which they believe greatly enhances the utility of the Dictionary."

".......In writing the English-Telugu Dictionary, one object has been, to provide the Telugus with a means of understanding some English books which cannot be satisfacterily translated into Telugu."[65]

(సశేషము)

64. "....at all events, as this work is intended as much to enable the student to understand the rules which regulate the classical compositions of the Natives, as to teach him to speak or write the common Teloogoo........ I have not neglected its more useful branches in the inferior dialect, which as being vulgar, Native authors have considered beneath the notice of the learned." (A Grammar of the Teloogoo Language by A. D. Campbell. Introduction. Page-XIV)

"Hindu Grammarians, like those of China, neglect the colloquial dialect, which they suppose is already known to the student, and teach only the poetical peculiarities." (A Grammar of the Telugu Language by C. P. Brown. Preface. Page-II)

65. English-Telugu Dictionary - Preface, Page 5.

# విశ్వనాథవారి రూపక పరిశీలనము

— శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు, ఎం.ఏ.

[మహాకవులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్యాన్ని అధ్యయనం చేయడంకోసం అక్టోబరు 26, 27 తేదీలలో 'రసధుని' పక్షాన 'విశ్వనాథ సాహిత్య సమాలోచనము' ఏర్పాటు చేయబడినది. ఈ సమావేశాలలో శ్రీమద్రామాయణ కల్పవృక్షముపై శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ సంపత్కుమారగారు, లఘుకావ్యములపై శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు, నాటకములపై శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు, నవలలపై శ్రీ జువ్వాడి గౌతమరావుగారు, శ్రీ నాగభూషణ్‌గారు వ్యాసములను చదివినారు. ఈ వ్యాసములలో ఇది మూడవది. —*సంపాదకులు.*]

విశ్వనాథ సాహిత్య సమాలోచనములో నావంతు రూపకపరిశీలనము. కావున, శ్రీ విశ్వనాథవారి రూపకములను గూర్చిన నా పరిశీలనమును సహృదయులకు నేడు నివేదించుచున్నాను.

## రూపకముల అనుపూర్వి

శ్రీ విశ్వనాథవారు బహురూపకకర్తలు. వారి ముద్రిత రూపకములలో ఆరునాటకములుగా పేర్కొనబడినవి ; ఒకటి నాటిక ; రెండు రేడియో రూపకములు. అవి ఇవి— 1. నర్తనశాల, 2. అనార్కలి, 3. వేనరాజు, 4. త్రిశూలము, 5. తల్లిలేని పిల్ల, 6. ధన్యకైలాసము, 7. అంతా నాటకమే, 8. కావ్య హరిశ్చంద్ర, 9. వేద హరిశ్చంద్ర. వీనిలో నర్తనశాలయు, అనార్కలీయు 1924 వ సంవత్సరమునకు ముందే రచింపబడినవి. (కిన్నెరసాని పాటలు, ఏకవీర కూడ ఈకాలపు రచనలే) ఇందు నర్తనశాలయే వీరి ప్రథమ రూపకము. అనార్కలి రెండవది. మూడవది అయిన వేనరాజు 1926 తరువాత రచింపబడినది. నాల్గవది అయిన త్రిశూలము విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి కోర్కె ననుసరించి 1933-34 సంవత్సరములో రచింపబడినది. (వేయిపడగలు కూడ ఈకాలమందే రచింపబడెను). 1933వ సంవత్సరములో గుంటూరు ఆంధ్రా క్రిష్టియన్ కాలేజి ఆంధ్రోపన్యాసక పదవికి శ్రీ విశ్వనాథవారు తిలోదకము లొసంగినారు. తరువాత 1938 వ సంవత్సరములో బెజవాడ శ్రీ రాజా రంగయ్యప్పారావు కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా చేరినారు. ఖాళీగా ఉన్న ఈ మధ్య కాలము (1933-1938) వారి జీవితమునకు పరీక్షా సమయము ; ఈ కాలమందే వారు అనేకములగు రచనలు, నూత్నప్రక్రియలలో వెలయించినారు. ఐదవ రూపకమైన తల్లిలేని పిల్ల 1935 ప్రాంతముల బందరు రామా హైస్కూలులోని 'ట్రెయినింగ్ సెక్షన్' వారి కొరకు ప్రత్యేకముగా వ్రాయబడినది. ఆరవ రూపకమైన ధన్య 'కైలాసము' తమ ప్రథమ రూపకమని శ్రీ విశ్వనాథవారి ప్రతిభలో ఎచ్చటనో వ్రాసినారట. నేను చూడలేదు, వారు చెప్పనూలేదు.

ఇది 17-12-1956 తేదీన ఆంధ్ర ప్రదేశ ప్రథమ శాసనసభాధ్యక్షుడగు శ్రీ కాశేశ్వరరావుగారికి అంకిత మీయబడినది: ప్రథమ ముద్రణము జనవరి, 1957. ఏడవ రూపకమగు 'అంతా నాటకమే' ఒక ప్రహసనము. ఇది 1950 వ సంవత్సరము తరువాతి రచన. ఇంక రేడియో రూపకములగు కావ్య-వేద హరిశ్చంద్రములు 1933-1936 ల మధ్య కేవలము రేడియోవారి కోరికమీద వ్రాసినారు. వీరి రేడియో రూపకమైన 'పాము పాట' (ధర్మాంగద) డా. బెజవాడ గోపాలరెడ్డిగారికి అంకిత మీయబడినది. అప్రకటితములైన వీరి రేడియో ప్రసారిత రూపకములు ఇంకను ఇంచుమించు ఒక వందవరకును కలవు.

## డ్రామా : నాటకము

ఇచ్చట సహృదయులకొక విషయమును స్పష్టము చేయవలసియున్నది. మనమిప్పుడు "Drama" అను ఆంగ్ల పదమునకు పర్యాయ పదములుగా రూపకము, నాటకము అను పదములను వాడుచున్నాము. సంస్కృతమునందు రూపము లేదా రూపకము అను పదము దృశ్యకావ్య సామాన్యవాచకము. ఇంక నాటకమనునది ప్రధానములైన పది రూపకముల లోను ప్రధాన భేదము మాత్రమే. అందుచే Drama అను అర్థములో 'రూపకము' అను పదమును వాడుటయే సమంజసము. కాని ప్రత్యేక రూపక విశేషమునకు పేరైన నాటకమను పదము రూపకమునకు పర్యాయపదముగా వాడబడిన సందర్భములు అర్వాచీన లక్షణ గ్రంథములందేకాక నాట్యశాస్త్రమందును కలవు. కావుననే మనమిప్పుడు రూపక-నాటక పదములను పర్యాయపదములుగా వాడుట సంభావ్యమగుచున్నది. శ్రీ విశ్వనాథవారి రూపకములను నాటకములనుట ఈ అర్థమందే. అంతియేకాని సంస్కృతాలంకారికులు చెప్పిన నాటక లక్షణములు సంపూర్ణముగా వీనియందున్నవని అనుకొనరాదు. ఇంక 'నాటికా' పదమును ఇట్లే సామాన్యవాచకముగా వాడబడుచున్నది. దీనికిని సంస్కృత నాటికాలక్షణములు పట్టవు. నేడు నాటిక అనగా 'చిన్నరూపకము' (వైశాల్యమున చిన్నది) అని మాత్రమే అర్థము. కావున ఆధునిక కాలమందు నాటక-నాటికాపదములకు ప్రాచీనార్థములు చెప్పుట కుదురదు; ఇది తెలుగులోని నేటి ప్రతి దృశ్యకావ్యమునకును వర్తించును. కొన్ని క్రొత్త నిర్వచనములను, లక్షణములను సూత్రీకరించవలసిన ఆవశ్యకము నేడెంతేని యు కలదు.

శ్రీ విశ్వనాథవారి రూపకములలో ఇంకొక విశేషము ఇంచుమించుగా వారి రూపకము లన్నియును విషాదాంతములే అగుట. ఇది ప్రాచీన భారతీయ మత విరుద్ధము. ఈ విషయమై మరల ప్రసంగింతును. ఇప్పు డింక శ్రీ విశ్వనాథవారి రూపకములను వరుసగా వివరింతును.

## నర్తనశాల

దీనికి 'కీచకవధ' అను నామాంతరము కలదు. ఈ కీచకవధ కథను శ్రీ సుసర్ల అనంతరావుగారు 1887 లో 'పాండవాజ్ఞాతవాసము' అను పేరుతో ఒక నాటకముగా, గద్య పద్యాత్మకముగా రచించినారు. అంతకుముందే శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'కీచక వధ'ను గద్యనాటకముగా రచించిరి. దానిని శ్రీ కొండా వేంకటప్పయ్య పంతులుగారు మొదలగు

వారు ప్రదర్శించిరి. ఇది ప్రకటితము కాలేదు, అంతియేకాదు వ్రాతప్రతియును అలభ్యమే. శ్రీ సునర్లవారిది అధికముగా పద్యమయమగుటచే దానిని ప్రదర్శింపజాలని రాజమహేంద్రవర హిందూనాటకసమాజమువారికి కేవలమొ వచననాటకము కావలసివచ్చినది. అప్పుడు 1889 లో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు 'కీచకవధ'ను వచన నాటకముగా సంతరించిరి. ఇదియే శ్రీ చిలకమర్తివారి తొలి రూపకము. ఇది 15-6-1889 వ తేదీన ప్రప్రథమముగా ప్రదర్శింపబడినది. ఆనాడు ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశంపంతులుగారు ద్రౌపది భూమికను ధరించినారట. తరువాత 1909 లో శ్రీ మంత్రిప్రెగడ భుజంగరావుగారును, శ్రీ తిరుపతి వేంకటకవులును ఈ కథను వేర్వేరుగా నాటకీకరించిరి. ఆతరువాత మరికొందరు రచించిరి. శ్రీ విశ్వనాథవారి నర్తనశాల 1924 వ సంవత్సరమునకు ముందరిదని చెప్పియున్నాను. దీనిని ప్రప్రథమముగా ముత్యాల రాజావారి సంస్థానోద్యోగులు శ్రీ విశ్వనాథవారి సమక్షమందే ప్రదర్శించినారట. ఆనాడు శ్రీ మాధవపెద్ది కీచకుడు; శ్రీ పారుపల్లి సుబ్బారావు ద్రౌపది. తరువాత 1934 ప్రాంతముల ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థులు వాల్తేరులో దీనిని ప్రదర్శించినారు. అప్పుడు శ్రీ పాటిబండ మాధవశర్మగారు ద్రౌపది, నేటి సినీనటుడు శ్రీ శేషగిరి కీచకుడు.

నర్తనశాలను సూత్రధారుడు 'నాటక' మని పేర్కొనెను. ఇందు 9 అంకములున్నవి. ఒక్కొక్క అంకము ఒక్కొక్కరంగముగా ఉన్నది. (పంచమాంకము మాత్రము న్యాయ్యముగా రెండు రంగములు కావలసి యున్నది - మొదటిది వీథి - వాహ్యాళిప్రదేశము, రెండవది సుదేష్ణాంతఃపురము) ఇది భారతీయపద్ధతి. ఇందు ప్రవేశకవిష్కంభాదులుకూడ లేవు.

ఏ రూపకమునైనను పరిశీలించవలసి ఉన్నపుడు అందు ముఖ్యముగా గమనించవలసిన అంశములు ఆరు ఉండును. 1. ఇతివృత్తము లేదా సన్నివేశములు, 2. నాయకుడు, 3. ఉద్దిష్ట ప్రయోజనము లేదా ఫలము, 4. పాత్రపోషణము, 5. రసము, 6. రచన. నర్తనశాల విషయమున ఈ అంశములను పరిశీలింతము.

(1) ఇతివృత్తము - ప్రథమాంకమందు కథ ఒక సాయంకాలమున ఆరంభమైనది. రెండవ అంకము దానికి కొంచెము తరువాత. 3 వ అంకము ఆరాత్రియందే. 4 వ అంకము ఆరాత్రి తెల్లవారుజామున. 5 వ అంకము మరునాడుదయము. 6 వ అంకము ఆ మధ్యాహ్నము. 7 వ అంకము ఆ సాయంత్రము. 8 వ అంకము ఆ రాత్రి మొదటిజాము. 9 వ అంకము ఆరాత్రి రెండవజాము. ఇట్లు మొత్తము కథ $1\frac{1}{2}$ రోజులలో పూర్తి అయినది. అందువలన కథాగతికి మంచివేగము చేకూరినది. ఏకనాయకమును, ఏకవిషయకమును అగుటచే వస్త్వైక్యమును, కథయంతయు మత్స్యనగరములోనే జరుగుటచే స్థలైక్యమును, ప్రత్యంకమును ఒక దినములోని అల్పభాగమందే పరిసమాప్తమగుటచే (అసలు, ఒక్కొక్క అంకమందలి కథను పూర్తిగా ఒకరోజు పట్టినను పట్టవచ్చును) కాలైక్యమును. అనవసరరంగవిభజనము కాని, కథలో అనవసరమగు పొడిగింపుకాని లేకపోవుటచే ప్రదర్శన సౌలభ్యమును సిద్ధించుచున్నవి.

ఇంక సంధ్యాదుల విషయము. ఇందలి కథ భారతమందలిది అగుటచే ప్రఖ్యాతమైనది. కీచకుడు ద్రౌపదిని సుదేష్ణాంతఃపురమున మొదటిసారిగా చూచుటతో నాటక మారంభమై

ఆతడు భీమునిచేతిలో నర్తనశాలయందు మడియుటతో నాటకము అంతమగుచున్నది. స్థూలముగా ఇది ఇందలికథ. నాయనమ్మలు, తాతయ్యలు చెప్పెడు పుక్కిటి పురాణములనుండి పురాణేతిహాస ప్రసిద్ధములయినవాని వరకును అన్నియును కథలే. కాని వానిలో అనగా కవిత్వమైనను లేదా ప్రఖ్యాతమైనను) తన హృదయము నాకర్షించిన ఒక కథను ఎన్నుకొని కవి స్వీయప్రతిభచే అందలి సన్నివేశములను సంగ్రహనముచేసి, లక్షణయుక్తమొనర్చి దానిని కావ్యముగా మలచును, లేదా నాటకీకరించును లేదా ఇంకొక ప్రక్రియకు పూనుకొనును. ఇట్లు పట్టి కథను గ్రహించి దానిని సంధి-సంధ్యంగాదులతో సర్వలక్షణ సంపన్నమొనర్చినప్పుడే అది 'ఇతివృత్త' మనబడుననియు, అంతియేకాని కథలెల్ల ఇతివృత్తములు కావనియు అభినవ గుప్తుడు స్పష్టముగా చెప్పియుండెను. కథకును, ఇతివృత్తమునకును గల ఇంత భేదమును గుర్తింపలేనిచో కావ్యపఠనాదులు అనవసరములనుట సాహసము కానేరదు.

నాటకాదులందలి అంకములు ఇతివృత్తమునకు బాహిరమయిన విభాగములైనట్లే సంధులనునవి ఆంతరమైన విభాగములు, ఒక్కొక్క సంధియందు మరల అనేకములగు అంగములున్నవి; సంధ్యంగముల మొత్తముసంఖ్య అరువదినాలుగు. ఇతివృత్తమందుగల చేవను బట్టియు, దాని వైశాల్యమును బట్టియు సాంగములగు ఈ ఐదు సంధులను ఉండును. వీధి మొదలగు రూపకములయందు రెండే సంధు లుండును. సాధారణముగా అంకపరిమితియును సంధిపరిమితియును ఒకటిగానే ఉండును. కాని అంకములు ఐదుకంటె అధికముగా కన్పట్టినప్పుడు ఒక్కొక్క సంధి రెండేసి అంకములందు నిబంధింపబడినదనియు, ఐదుకంటె తక్కువ అంకము లున్నప్పుడు ఒక అంకమునందే రెండేసి సంధులు నిబంధింపబడినవనియు గ్రహింపవలసి ఉన్నది. ఇతివృత్త నిర్మాణమునుగూర్చి ఆధునికులలో వ్యాప్తములై ఉన్న అపోహలను తొలగించుచు ఒక విపులమగు వ్యాసమును వ్రాసియున్నాను. అది నాట్యకళలో ప్రకటిత మగుచున్నది.

నర్తనశాలయందు తొమ్మిది అంకములున్నవని చెప్పియున్నాను. ఇందు ప్రథమాంకమునందు ముఖసంధి కలదు. ద్వితీయ-తృతీయాంకములందు ప్రతిముఖసంధి కలదు. చతుర్థ-పంచమాంకములందు గర్భసంధియు, షష్ఠ-సప్తమాంకములందు అవమర్శ సంధియు, అష్టమ-నవమాంకములందు నిర్వహణ సంధియును కలవు. ఉదాహరణముగా ముఖసంధిని వివరింతును—కీచకుడు ద్రౌపదిని ఆకస్మికముగా చూచి ప్రథమ దృక్పాతముననే బద్ధ ప్రణయుడైనాడు. కీచక ప్రణయమునకు కాక కీచకవధ మనెడి నాటకమునకు ఇదియే బీజము. ఇంక ఆమెను గూర్చి తెలిసికొనవలెననెడి జిజ్ఞాస వానిలో బయలుదేరినది. ఇది ఆరంభము "నీ యీ ప్రవర్తన మీ యక్కగారి యంతఃపుర గౌరవమునకు భంగకరమైనది" (పుట-18) అని ద్రౌపది అనుటతో కీచకుడు నివ్వెఅపడి వెడలిపోయినాడు. ఇది బీజ విచ్ఛేదము. అయినను "కాని నా హృదయాంతరమును దహించుచునే యుంటివి" అని చెప్పి వెడలుటలో బిందువు ప్రసక్తమై బీజమునకు అవిచ్ఛేదకారణమైనది. ఇంతటితో అనగా ప్రథమాంకముతో ముఖసంధి ముగియుచున్నది. ఇట్లే తక్కిన సంధులనుకూడ ఊహించుకొనవలయును.

ఇంక ఇందలి నాయకు డెవరు ? ఫల మేమి ? అనునవి నిర్ణయింపఁబడవలెను. ఇవి రెండును అన్యోన్యాశ్రయములు. దీనికి కీచకవధ మను నామాంతరమున్నదని తెలిసికొంటిమికదా. ఇందులో కవి నిరూపింపదలచినది కీచకవధమును; అతడు వధార్హుడగుటకు హేతువు వానికి గల పరస్త్రీ కాముకత. ఆ అధర్మమును నిర్మూలించి ధర్మస్థాపనమును చేయుటకు పూనుకొనిన వాడు యుధిష్ఠిరుడు. ఈ విషయము పంచమాంకమందు కలదు. "ధర్మమూర్తులగు తమరు నిల్చినచో ఏ సభ" అని ఉత్తరచే కవి చెప్పించుట గమనార్హము. ఈ నాటకమునకు ఈ అంకమే ఆయువుపట్టు అని చెప్పవచ్చును. కీచకవధమునకు అతి నిగూఢముగా పన్నుగడ పన్నినవాడు యుధిష్ఠిరుడు; యుధిష్ఠిరునికి బదులుగా ద్రౌపదీ-భీములు కథను నడిపించినారు. ఈ దృష్టితో చూచినచో ఇందు నాయకుడు ధర్మరాజు. అతడు సాధించిన ఫలము 'కీచకుడు' అనెడి అధర్మమును నిర్మూలించి, ధర్మస్థాపనము చేయుట. ఇంక కీచకుడు ప్రతినాయకుడు. ఇది ప్రాచీన భారతీయ దృక్పథము. ఇచ్చట ఒక సందేహము కలుగవచ్చును. నాటకము ప్రత్యక్ష నేతృచరితము కావలెననియు, బీజారంభాదులు నాయకగతములే కావలెననియు ఆలంకారికమతముకదా, మరి ధర్మజుడెట్లు నాయకుడు కాగలడు ? అంకము ప్రత్యక్ష నేతృ చరితము కావలెననుట పరమసూత్రము కాదు. మరియు బీజారంభాదులు కేవలము నాయక గతములే కానక్కరలేదనియు, నాయక-అమాత్య-నాయికా-ప్రతినాయకులలో ఎవరైనను బీజారంభాదులకు నెలవులు కావచ్చుననియు ఫలభోక్త ఎవరో అతడుమాత్రమే నాయకు డగు ననియు అభినవగుప్తుడు స్పష్టముగానే చెప్పియున్నాడు. కావున ఇందు ధర్మజుడు నాయకుడు ; ధర్మవీరము రసమగుచున్నది. దీనికి శృంగారాభాసము అంగము. ఇట్లూహించినప్పుడే ఇది ఆలంకారికుల దృష్టిలో నాటకము కాగలదు.

ఇచ్చట ఇంకొక సత్యమును గుర్తించవలసి ఉన్నది. శ్రీ విశ్వనాథవారు ఈ నాటకమును కేవలము భారతీయదృష్టితోనే రచించినట్లు కన్పట్టదు. వారు సంస్కృతాంధ్రములందే కాక ఆంగ్లమునందును పండితులు. షేక్స్పియరు విషాద నాటకముల ప్రభావము వారిమీద అధికముగా గలదు. అందుచే ఇతివృత్త నిర్వహణములో ఆ విధమునకు సంబంధించిన ఛాయలు స్పష్టముగా కన్పించుచున్నవి. పాశ్చాత్య దృష్టితో పరిశీలించినచో నర్తనశాలయందు కీచకుడు నాయకుడు. ఈ నాటకము నాయక మరణముతో అంతమగుచున్నది. కీచకుడు నాయకుడని అంగీకరించినచో ఏకత్రైవానురాగమగుటవలన శృంగారము ఆభాస మగుచున్నది. నాటకమున ప్రధాన రసము ఆభాస మగుటకును, అంతమున నాయకుడు మరణించుటకును భారతీయు లంగీకరించరు. ఇవి పాశ్చాత్యులకు నిషిద్ధములు కావు. ప్రఖ్యాతులును, ఉదాత్తులును అయిన ఉత్తమనాయకుల కథలను స్వీకరించి, వారు ఉత్తమ పురుషార్థసిద్ధికై ప్రయత్నించి సఫలులగునట్లుగా చిత్రించుట, అందులకు శృంగారమునో, వీరమునో ప్రధానరసమును చేయుట భారతీయుల సంప్రదాయము. పైవిధముగా నాటక-ప్రకరణములను రచించి తద్వారా ప్రేక్షకులకు కాంతాసమ్మితముగా ఉపదేశమొనర్చుట వారి ఆశయము ; తద్దర్శన-శ్రవణముల వలన సహృదయులైన ప్రేక్షకులు విచిత్రమైన ఒక అనుభూతికి లోనై ఆ నాయకాదులతో తాదాత్మ్యమును చెంది విభావాది చర్వణవలన అలౌకికమైన రసానందమును

అనుభవింతురు. ఇది భారతీయుల రసపోషణ దృష్టి. నాయకులు ప్రఖ్యాతులును. ఉదాత్తులు కానిచో, రసమునకు సమగ్రపోషణ లేనిచో ప్రేక్షకులు నాయకాదులతో తాదాత్మ్యమును పొందుటకు వీలుండదు. కావుననే పాశ్చాత్యుల రూపకములు రసప్రధానములు కావని చెప్పుట యుక్తమగుచున్నది.

పాశ్చాత్యులలో action మిక్కిలి ప్రధానము. ఇంకను సూటిగా చెప్పవలయు నన్నచో అరిస్టాటిల్ చెప్పినట్లు 'Men in action' వారి రూపకములందు ప్రధానము. మరియు వారి రూపకములందు భావసంఘర్షణములు ప్రాముఖ్యమును వహింపవలయును. ముఖ్యముగా భావ సంఘర్షణము (Conflict) లేనిచో ఇతర గుణము లెన్ని ఉన్నను అది రూపక మనిపించుకోదని వారి మతము. అంతియేకాక "to hold mirror to nature" అనునది కూడ వారి సిద్ధాంతమే, అనగా ఆయా పరిస్థితులలో ఆయా వ్యక్తులు ఎట్లు సంచరింతురో చూపుటయే వారి ధ్యేయము. అందుచే వారికి పాత్రపోషణమునందు దృష్టి ఎక్కువ. వారి నాయకులకు సాధించవలసిన ఒక ఉత్తమ ప్రయోజనము అనునది సాధారణముగా ఉండదు. హామ్లెట్ నాటకమునందు 'పితృ హత్యకు ప్రతీకారముచేయుట' అనునది సాధ్యఫలముగా ఉన్నది. కాని ఇట్టివి భారతీయులదృష్టిలో ఉత్తమ ఫలములు కాజాలవు.

ఆధునికులు సామాన్యుని కూడ విషాదరూపకనాయకుని చేయుచున్నారు. కాని అరిస్టాటిల్ మొదలు ఎలిజబెత్ యుగమువరకును విషాదరూపకనాయకుడు ఉత్తముడుగానే ఉండవలెనన్న నియమము ఉండెడిది. అత డెంతఉత్తముడయినను వానిలో ఉన్న ఒక ప్రధాన లోపముచే అతడు పతనమై తన మరణమును తానే తెచ్చుకొనును. అతని తక్కిన గుణములచే ఆకర్షితులైన ప్రేక్షకులకు వాని ప్రస్తుతస్థితి శోక-భయములను కలిగించును. అప్పుడు వారిలో సహజములై ఉన్న శోక - భయములు ఉద్రిక్తములై, క్రమముగా క్షీణితములై వారికి మనశ్శాంతిని కలిగించును.

స్థూలముగా ఇది పాశ్చాత్యుల దృష్టి. ఈ దృష్టిలో కీచకుడు అచ్చమయిన విషాద నాయకు డగుచున్నాడు. (పాశ్చాత్యులలో పరస్త్రీకాముకతమూలముగా పతనమైన విషాద రూపకనాయకులు లేరు. Webster రచించిన "Dutchess of Malfi" వంటి రూపకములు అర్వాచీనకాలమందలివి మాత్రమే).

ఇందు నాయకవధను రంగమున ప్రత్యక్షముగా చూపలేదు. అచ్చట భారతీయ సంప్రదాయము పాటింపబడినది. మరణము ప్రత్యక్షముగా చూపబడకపోవుటచే దీనికి 'ట్రాజెడీ' గుణము లోపించినదేమో అని కొందరు సంశయించుచున్నారు. ఆ అభిప్రాయము సమంజసము కాదు. విషాదరూపకమునకు ఆ గుణమును కలిగించునది మరణాంతత్వము కాదనియు ఆ మరణమునకు దారితీసిన విషాదపరిస్థితులే అనియు తెలియవలెను. కావున వధాంతనాటకము వేరు, విషాదనాటకము వేరు అనెడి సత్యమును గుర్తించుట అవశ్యకము.

ఈ నర్తనశాలయందలి కథాగమనమునకు వేగ మెక్కువ. అందుచే ఇది action ప్రధానముగా గలది అగుచున్నది. సంభాషణలుకూడ చకచక సాగిపోవుచున్నవి. సంభాషణల

యందు ఉక్తి-ప్రత్యుక్తికా వైఖరి ప్రధానము. దీనిపై కవి ఎక్కువ శ్రద్ధ వహించెననుటలో అతిశయోక్తి లేదు.

ఇందులో పాత్రలన్నియును చాలవరకు సజీవములుగా ఉన్నవి. కీచకునిది అస్థానపతితమైన కాముకత కానిచో నిజమునకు అతడు ఉత్తమోత్తమ శృంగారనాయకుడు అగుటకు తగి ఉన్నాడు. "....శత్రు నృపతులు మత్స్యదేశములపైని, దృష్టిపఱుపరు నాకంటి యెఱుపుఁ జూచి" అనుచు, నాటకారంభమున ప్రవేశించినదిమొదలు అంతమున భీముని గుర్తించి పొంగిపోయి కఠినుడైపోయి "ఛీ ! నా కౌఁగిలి స్త్రీవై వచ్చి పౌరుష మేటికి ?" అని భీముని ఈసడించువరకును కీచకపాత్ర చక్కగా పోషింపబడినది. సంకేతము ననుసరించి నర్తనశాలకు బయలుదేరుటకుముందు వానికి నిజముగానే పశ్చాత్తాపము కలిగినది. కాని చివరకు కామమే జయించి వాని పతనమును అత్యంత సన్నిహిత మొనర్చినది. సుదేష్ణ దోషరహిత అను విషయ మిందు నిరూపితమైనది. ఆమె కీచకుని నిరసించు సమయమున మహారాజ్ఞివలెనే ప్రవర్తించినది. భారతమున లేని వల్లికీపాత్ర ఇందు అధికముగా కల్పింపబడినది, ఈమె వలననే సుదేష్ణ మోసగింపబడినది. ఈ వల్లకి ప్రయత్నావస్థలో సాహాయ్యకారిణిగా ప్రవేశించి కథ అడ్డము తిరుగగానే కథనుండి త్రోసివేయబడినది. ఈమెచే ద్రౌపదిని అనిపించినమాటలు మాత్రము జుగుప్సావహముగా ఉన్నవి. ద్రౌపదియు ఒక పనికత్తెయే ; సుదేష్ణ ఆమె కిచ్చుచున్న గౌరవమునుబట్టి తక్కినవారికి ఆమెమీద అసూయ ఉండుటయు సహజమే. కాని, ద్రౌపదిని అట్లు తిరస్కరించి మాటాడగలుగుట సమంజసము కాదేమో.

ఇందలి పాత్రలన్నింటిలోను ఉత్తర పాత్ర చాల లలితమైనది. సత్యనారాయణగారు సాధారణముగా తమ ప్రతిరూపకమందును lyrical element చొప్పించుచుందురు. నర్తనశాలలో ఆమె ఇట్టిది. ఆమె చూపిన ఉదాత్తత వయస్సును మించినదిగా కన్పట్టుచున్నది. అయినను కీచకు డన్నట్లు "ప్రపంచములోని దౌష్ట్యమేమియు నెరుంగని యీ పసికూనయే తగును ధర్మాధికారమునకు." విరహిజన సంతాపకారిణియగు వర్షఋతు వాతావరణమును ఎన్నుకొనుటలోనే కవి గొప్పదన మున్నది. మొత్తమున కిది ప్రదర్శనయోగ్యమైన ఒక చక్కని రూపకము.

## అనార్కలి

ఇది శ్రీ విశ్వనాథవారి రెండవ రూపకము. సూత్రధారునిచే ఇది "నూత్న మార్గ విరచిత దృశ్య" మని చెప్పించినారు. అంతమందు సలీముచే "విషాద నాటక" మనిపించినారు. కాని ఇది నూత్నమార్గ విరచితమైన విషాదరూపకమే కాని భారతీయుల నాటకము మాత్రము కాదు. దీని లక్షణములు దీనికి పట్టవు. ఇది నూత్నమార్గ విరచిత మనుటకు కారణములు—(1) నాయకుడు కీచకునివంటివాడు కాకపోయినను రూపకము విషాదాంత మగుట; (2) అంకములందు రంగములను కల్పించుట, (3) పూర్వాంకమందు చిలుకలు, పూవులు మొదలగు వానిని సజీవములనుగా కల్పించుట, నాయకుని అంతర వ్యక్తిగా 'కవి పాత్ర'ను సృష్టించుట,

(4) lyrical element ను అధికము చేయుట. ఈ విధముగా ఇది నర్తనశాలకంటె నూత్న మార్గమందు రచింపబడినది.

ఇందు పూర్వాంక-ఉత్తరాంకము లనుపేర రెండంకము లున్నవి. వానిలో మరల చిన్న చిన్న రంగములున్నవి. పూర్వాంకమందు పది, ఉత్తరాంకమందు పదునొకండును రంగములు కలవు. వీనిని మొత్తము నాలుగు అంకములనుగా చేయవచ్చును. పూర్వాంకమందలి మొదటి 7 రంగములను ఒక అంకము. అప్పటినుండి పూర్వాంకాంతమువరకును గల 3 రంగములను ఒక అంకము. అట్లే ఉత్తరాంకములోని మొదటి మూడు రంగములను ఒక అంకము, తరువాతి 8 రంగములను ఇంకొక అంకము. అసలు వీనిలో కొన్ని రంగములను అంతకు ముందువానిలోనో, వెనుకవానిలోనో కలిపివేయవచ్చును కూడ. ఇట్లు చేసినచో ఇది చతురంక మగుచున్నది. అంతియే కాక ఇది కేవలము శృంగారప్రధాన మగుటచేతను దీనియందు భారతీయుల నాటికాలక్షణము కొంతవరకు సరిపోవుచున్నది.

యువరాజును, భావిభారత చక్రవర్తియును అగు సలీము దాసిన అగు అనార్కలీని ప్రేమించినాడు. ఆమె వానియందు బద్ధానురాగ అయినది. ఈ వీరి ప్రణయము సంప్రదాయమునకు ఎదురు, చక్రవర్తిత్వమునకు అవమానము. అందుచే వారి ప్రణయము ఫలింపలేదు. అమాయిక అగు అనార్కలీ ఉరితీయబడినది. సలీము పిచ్చివానివలె అయినాడు. —ఇదీ ఇందలి ఇతివృత్తము.

ఒకరివిషయ మింకొకరికి తెలియకపోయినను కథాప్రారంభమునకు ముందే నాయికానాయకు లిరువురును పరస్పరము అనురాగవశులైనారు. అందుచే తక్కిన శృంగారరూపకము లందువలె ఇందు బీజ-ఆరంభములు రెండును ప్రదర్శితములు కాలేదు. పూర్వాంకమందలి ప్రథమరంగము విష్కంభప్రాయము మాత్రమే. దీనిని ఆంగ్లమున exposition అందురు. 2 వ రంగములో కథా ప్రారంభ మగుచున్నది. ఇందు మిత్రునితోడి సంభాషణములో సలీము అనార్కలీని ప్రేమించుట అతర్కితముగా బహిర్గతమైనది. "స్వర్గవాహిని చవిటిపఱ్ఱలమీద ప్రవహించుచున్నది." అని అతడు హెచ్చరించినాడు. ఇంతటితో ఈ మిత్రుడు మఱుగుపడిపోయెను. ఈ మిత్రుడెవ్వరో. ఎటువంటివాడో తెలియదు, ఈ మిత్రుడు వేనరాజునందలి గౌతమునివంటివాడై ఎదురుతిరిగి అక్బరుతోకలిసి సలీమునకు తానే ఆపదను చేకూర్చి ఉండవలసినది లేదా సలీమునకు తోడ్పడి ఈ విషాద రూపకమున తానును భాగస్వామి కావలసి ఉన్నది. అట్టి దేమియును జరుగలేదు. ఈ పాత్రవలని ప్రయోజన మల్పము. నర్తనశాలయందలి శారద్వతుడును ఇట్టివాడే.

ఇందలి నాయకుడు ప్రేమమయమూర్తి అగు సలీము. అతడు సాధింపదలచుకొన్నది కామపురుషారమయిన అనార్కలీ రూపకమగు ఫలమును. అనార్కలీ అపురూపసౌందర్యవతి అయినను, ప్రేమమయమూర్తి అయినను ఆమెకు మాహారాజ్ఞి కాగల అర్హత లేదు. అనగా రత్నావళి మొదలగు నాటికలయందలి నాయికవంటిది కాదామె. కావున సలీము ప్రేమ అస్థానపతితమైనది. ఇది ఉభయత్రానురాగమే అయినను, నాయకుని ప్రేమ అస్థానపతిత మగుటచే అది ఫలించుట కవకాశము లేకపోయినది, అందుచే ఈ రూపకమును విషాదాంతమే

అయినది. కాని వినిర్మల మనస్కులైన ఆ ప్రేమ జీవుల ప్రణయము ప్రేక్షకుల హృదయముల నాకర్షించి, విషాదపూరితములను చేయుటకు సమర్థమై ఉన్నది.

నాయకుడగు సలీము స్వదోషముచే తానుగా పతనావస్థను పొందినట్లు ఇందు నిరూపితము కాలేదు. అందుచే విషాదనాయక లక్షణములు వీనియందు సంపూర్ణముగా పట్టలేదు. అసలు, సలీముపాత్ర పూర్తిగా జీవముపోసికొన్నట్లు లేదు. అయినను వానిలో కొన్ని flashes మాత్రము కలవు. ఇందు సలీమ్ను సూఫీమతస్థునిగా చిత్రింపబడినాడు. ఈ మతము మన వేదాంతమునకు కొంత సన్నిహితమట.

ఈ ఇతివృత్తములో అనార్కలీ నృత్యము కేంద్ర బిందువు వంటిది. ఈ నృత్యమును సలీము కథాప్రారంభమునకుముందే చూచి ఆమెను వలచి ఉన్నాడు. ఇది మరల పూర్వాంక మందలి 5 వ రంగమున ప్రదర్శింపబడినది. దానితో వారి ప్రేమ దృఢమైనది. కాని ఆ నృత్యమే అంతమున ఆమె నాశమునకు కారణమైనది. ఇది ఇందలి రహస్యము. అనార్కలీ-సలీముల వివాహమును అక్బరుకంటె అధికముగా రాజా మాన్‌సింగ్ వ్యతిరేకించియున్నాడు. అతడు సలీము మనస్సును విరచుటకు వందులను పంపినాడు. వారు మొదట కాలసూచకములను చదివి అనగా గ్రీష్మమును వర్ణించి తరువాత అన్యాపదేశముగా "ఉత్తమజాతి భృంగము నీచభావముల పొంతపో" దని సూచింతురు (పుట-104). శ్రీ విశ్వనాథవారీ శిల్పమును ముద్రారాక్షసమునుండి కైకొనినారు. ముద్రారాక్షసమందు 3 వ అంకములో వైతాళికులు వచ్చి మొదట శరద్వర్ణనముచేసి, పిమ్మట "మహారాజులు ఆజ్ఞాధిక్కారమును సహింపరు" అని సూచింతురు. అది చంద్రగుప్తుని మనస్సు విరిగినట్లుగా చూపించుట కుపయుక్తమైనది.

ఇచ్చట వందు లెంతగా ప్రయత్నించినను సలీము తన మనస్సును మార్చుకొనలేదు. అందుచే అనార్కలీని తొలగించుటకే మాన్‌సింగు కృతనిశ్చయుడైనాడు. ఆమెయందు దోషమును ప్రత్యక్షముగా ఆరోపించుటకే మరల నృత్యప్రదర్శనమును ఏర్పాటు చేయించెను. అమాయికులగు ఆ ప్రణయజీవులు ఆ వలలో పడిపోయినారు.

ఇచ్చట ఒక విషయమును గుర్తించవలసి ఉన్నది. రాజా మాన్‌సింగ్ సుక్షత్రియుడైనను తనకంటె తక్కువవారని తాను భావించెడి మహమ్మదీయులతో సంబంధములు చేసినాడు. కాని తన మేనల్లుడు మాత్రము అతనికంటె ఇంకను తక్కువ అయిన ఆమెను మాత్రము వివాహము చేసికోరాదట. ఇది ఒక విచిత్రమైన మనస్తత్వము. ఇట్టి మూర్ఖతతో చివరకు ముగ్ధప్రణయిని అయిన అనార్కలీ మరణమునకు తాను కారణభూతుడైనాడు. ఆ అమాయికజీవి అనార్కలీ శాపమే క్షత్రియవంశ నాశనమునకు కారణమైనదని శ్రీ విశ్వనాథవారిందు చరిత్రకు వ్యాఖ్యానము చేసినారు.

ఈ రూపకమందు అనార్కలీ ప్రధానపాత్ర అగుటచేతను, నిజమునకు ఆమె జీవితమే విషాదాంత మగుటచేతను దీనికి 'అనార్కలీ' అను పేరు సమంజసముగా ఉన్నది. ఇందులో రునీ-అజీజ్‌ల వృత్తాంతము ప్రాసంగికము. ఇది చక్కగానే నిర్వహింపబడినది కాని దీనికి ప్రయోజనము అత్యల్పము.

ఇతివృత్తమునందు మొత్తము రెండుభాగము లున్నవని చెప్పినాను; వానినే కవి పూర్వ-అపర అంకములనెను. ఇందు మొదటిభాగము అనార్కలీ-సలీముల ప్రేమాభివృద్ధిని (శృంగారరస పోషణమును), రెండవభాగము తన్నాశమును చిత్రించుచున్నవి. ఈ ప్రథమభాగమందు శ్రీ విశ్వనాథవారు ఒక క్రొత్త పద్ధతిని అవలంబించి ఉన్నారు. ఇందు వసంతుడు, పూలకన్నెలు, మన్మథుడు, చిలుకలు, కోకిలలు, కవి మొదలైన పాత్రలను సృష్టించి ఉన్నారు. దీని విషయమై ప్రస్తావనలో వారు సూత్రధారునిచే చెప్పించిన వాక్యములనే ఇక్కడ పేర్కొనుచున్నాను— "....ఇందలి పూర్వాంకమందలి రచనా పద్ధతికి వ్యాఖ్యానప్రాయముగా రెండు మాటలను చెప్పెదను. ఇందు వసంతుడు, పూలకన్నెలు, మన్మథుడు, చిలుక, కోకిల, కవి మొదలైన పాత్రలు వత్తురు. వీరందరును నాయికానాయకుల సమక్షమందే వచ్చెదరు. మన పూర్వ కావ్యములందు వీని నుద్దీపన విభావములుగా చెప్పిరి. ఆ యుద్దీపన విభావము వెనుకనున్న మానసిక స్థితి యా యా పాత్రల వాక్కులందు వారి మాటలుగా గ్రుచ్చబడినవి. కవి నాయకునిలోనే యొక భాగము. అతడు బయటి కింకొక పాత్రవలె కనుపించును కాని కథానాయకుడుకాని సలీము, ఒక మహోత్కృష్ట భావపరంపరాలగ్నబుద్ధి యగు సలీము, కవిగా కనిపించుచున్నాడు. చిలుక కోకిల మొదలైనవి పలికిన పలుకులు వానియందున్న యర్థమును నాయికానాయకులు సంకల్పించుకొనిరి. ఆ భావములే చిలుకలు కోకిలలు పుష్పకన్యలు చెప్పిన ట్లిందు వ్రాయబడినది."

బెల్జియం దేశస్థుడును, ప్రసిద్ధ నాటకకర్తయును అగు మారిస్ మేటర్ లింకు నుండి పై క్రొత్తపద్ధతిని శ్రీ విశ్వనాథవారు తెలుగులో అనుసంధించుకొన్నారు. మేటర్ లింకు 1886 లో జన్మించెను (అనగా విశ్వనాథవారికంటె కొంచెము పెద్ద) జన్మదేశము బెల్జియము అయినను పెరిగినది ఫ్రాంసులోనే. అందుచే ఫ్రెంచి సాహిత్య ప్రభావము వానిపై అత్యధికముగా గలదు. కాని మేటర్ లింకులో ఒక ప్రత్యేకత కలదు. రూపక రచనలో వాని ధ్యేయము ఆధ్యాత్మిక సౌందర్య ప్రపంచనము. ఇందుల కాతడు సరళమైన భాషను పదములను, చిన్న చిన్న వాక్యములను సాధనములుగా గ్రహించినాడు. అనార్కలీ రచనయు ఇట్టిదే.

ఆధ్యాత్మిక సౌందర్యమునకు సంబంధించిన అభౌతికార్థముల నన్నింటిని భాషలోని పదములు, వానికున్న అర్థములు పూర్ణముగా వ్యక్తము చేయలేవు. అందుచే అతడు కొన్ని సంజ్ఞలను ఏర్పరచుకొనవలసివచ్చినది. దీనినే 'సంజ్ఞావాచకత్వము లేదా ప్రతీకవాదము (symbolism)' అందురు. ఇందులకాతడు పక్షుల నెక్కువగా ఉపయోగించెను. మంచిని చెప్పుటకు గోరువంకలను చిలుకలను; చెడును చెప్పుటకు కాకులను గ్రుడ్లగూబలను ఉపయోగించెను. శ్రీ విశ్వనాథవారు స్వచ్ఛమైన ప్రణయజీవుల నిర్మల భావములను వ్యక్తముచేయుటలో పై విధానమును గ్రహించినారు. అందుచే స్థూలదృష్టితో ప్రయోజనము భిన్నమని చెప్పవచ్చును.

మొత్తమునకు ఇందులో lyrical element అధికమగుటచేత ఇది ఒక చిన్న కావ్యము వలె గోచరించుచున్నదేకాని రూపకముగా పుష్టి నందుకొనలేదేమో అని అనిపించుచున్నది.

ఇట్టి రచనలకు ప్రదర్శనసౌలభ్యము తక్కువ. బాగుగా ప్రదర్శించవలెనన్నచో నటులకు మంచి శిక్షణ, తగిన అవకాశములు ఉండవలెను. అందుచేతనే "మచ్ఛిష్యుడైన ఈ నటకావతంసుని విజ్ఞానము నాశ్రయించి యీ దృశ్యకావ్యమునకు అప్రదర్శనయోగ్యతాదోషమును పరిహరించుకొని" అనియు "అల్పజ్ఞులమైన మేము వారి (అనగా కవి) బోధనచేత కాక యీ నూత్న రచనను ప్రదర్శించనేలేము" అనియు ప్రస్తావనలో చెప్పుకొనవలసివచ్చినది. నృత్య నాటకముగా దీనిని ప్రదర్శించుట రమ్యతరముగా ఉండునని భావించుచున్నాను. 1938 ప్రాంతముల శ్రీ బి. వి. నరసింహారావుగారు రాజమండ్రి ట్రెయినింగు కాలేజీలో దీనిని ఇంచుమించుగా అట్లే ప్రదర్శించినారు.

అనార్కలీ కథను ఇతివృత్తముగా తీసికొని శ్రీ ముద్దుకృష్ణగారు ఒక రేడియో రూపకమును, శ్రీ ఊటుకూరి సత్యనారాయణరావుగా రింకొక నాటకమును రచించినారు. రేడియో నాటికలో శ్రీ కె. వి. గోపాలస్వామిగారు అనినట్లు "ఆర్థిక వ్యవస్థకును, ఆవేశ ప్రధానమైన ప్రేమకును సంఘర్షణము ప్రధానము." ఇంక ఊటుకూరివారిది కొంత ప్రదర్శన సౌలభ్యముకల రూపకము.

వేనరాజు

ఆధునికాంధ్ర సాహితీరంగములో శ్రీ నండూరివారి "ఎంకి పాటలు" ఒకవిధముగా ఎంత గాలిదుమారమును రేపినవో శ్రీ విశ్వనాథవారి వేనరాజు అంత గాలిదుమారమును రేపినదని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పేర్కొనియున్నారు. రాజకీయరంగంలో 'మా కొద్దీ తెల్ల దొరతనం' అన్న పాటకూడ ఇటువంటిదే. ఇది శ్రీ విశ్వనాథవారి మూడవ నాటకము.

వేనుడు పౌరాణిక పురుషుడు. మాతామహ దోషముచే ఇతడు దుర్మార్గుడై, ప్రత్యక్షము కానిదానియందెందును నమ్మకము లేనివాడయ్యెను. రాజే విష్ణువు అనెడి ధీమతో అహంకరించి సంచరించి చివరకు మహర్షుల కోపాగ్నికి ఆహుతి అయినాడు. భాగవత చతుర్థస్కంధములోని వేనుని స్వరూప మింతమాత్రమే చిత్రితమైనది. అసలుకథ అంతయును 40 పద్యములలో ఉన్నది.

పై కథను శ్రీ విశ్వనాథవారు చాల మార్పుచేసివేసినారు. ముఖ్యముగా అందలి వేనునకును, నాటకమందలి వేనునకును పోలికయే లేదు. గౌతముని పాత్ర, వందుల కథ పూర్తిగా క్రొత్తగా కల్పింపబడినది. నర్తనశాల విషయమున చేసినట్లే వేనరాజు నాటకమును కూడ రెండు విధములుగా వ్యాఖ్యానింపవచ్చును—భారతీయ దృష్టితో చూచినచో ఇందు దుష్టసంహారము, ధర్మ సంస్థాపనము ముఖ్యములు. 131 వ పుటలో "నాకు వేను డేమి శత్రువు? ధర్మమునకు శత్రువు' అని గౌతముడనుట గమనార్హము. ఇందు పృథువు నాయకుడు. అంగరాజు, గౌతముడు, వందులు తత్సహాయులు. వేనుడు ప్రతినాయకుడు. ధర్మవీరము ఇందలి రసము. పది అంకములు కల నాటకమిది.

కాని వేనుని నాయకునిగా పరిగణించినప్పుడు ఇది విషాదరూపకమగుచున్నది. దీనికి 'వేనరాజు' అను పేరు పెట్టుటలోనే అతడు నాయకుడనెడి అభిప్రాయము వ్యక్తమగుచున్నది. వేనుడును నిస్సందేహముగా మహాపురుషుడే. కాని వానికున్నది ఒక్కటే లోపము - అది సనాతనధర్మ వ్యతిరేకత అనగా లోకమున కెదురీత. ఈ లోపమువలననే అతడు తన చావును తానే తెచ్చుకొనినాడు.

శ్రీ విశ్వనాథవారి వేనుడు చాల విచిత్రమైన వ్యక్తి. వానికి ప్రాచీనాచారము లేవియును గిట్టవు. "స్మృతికర్తలైన ఋషులు దేశములో స్వాతంత్ర్యభావములను చంపివేసిరా" రని వాని నమ్మకము. వివాహమనెడి కృత్రిమ సంయోగము చేతనే జగము నాశమగుచున్నదని వాని నమ్మకము. వాని దృష్టిలో ప్రేమకు లింగవివక్ష లేదు. పురుషుని పురుషుడు ప్రేమించ వచ్చును. చివరకు ఏకగర్భ సంజనితులు కూడ వివాహమాడవచ్చును. (పుట 33). ఇట్టి విపరీతపు ఊహలు కలవాడు వేనుడు. అయినను లోకమెల్ల తన మార్గముననే నడువవలెనని కోరువాడు. లేనిచో నిర్దయుగా మారణహోమ మాచరింపగల కర్కశుడాతడు. వానికి తండ్రి లేడు, తల్లి లేదు; తాను చూడలేదు కాన తాను సునీథకు పుట్టినన్నదానిని కూడ అతడు నమ్మడు. "వేదమతము సర్వనాశమైన తరువాత ప్రపంచమంతటను వేనుడే దేవుడు" అగునని అత డెదురుచూచుచుండెను. అత డెన్ని ఘోరకృత్యములు చేయుచున్నను, అతని ప్రశాంతత ముడివడదు. కోపముగా అతని నోటివెంట మాటరాదు. వాని కా స్థితిసహజమై పోయినది. ఇట్టి విపరీత ప్రవృత్తి కలవాడయ్యును అత డొక సౌందర్య పిపాసి; గొప్ప సంగీతజ్ఞుడు. అతడు వీణ వాయించునప్పుడు దివ్యపురుషునివలె ఉండునని గౌతముడనుట గమనార్హము (పుట 132). ఇట్లు వీనియందు పరస్పర విరుద్ధములగుగుణములు సమ్మేళనము పొందియున్నవి.

వేనుని క్రౌర్యమంతయును తన నాస్తిక మతమునకు విరోధులైనవారిమీదనే. తనకు విరోధిగా మారినను గౌతముడన్నచో వాని కమితమగు ప్రేమ, వేనుడు కేవలము బాహ్య సౌందర్యమును మాత్రమే, అందున పురుషులను ప్రేమించును. ఇట్టి విపరీతపుత్రోవలలో నడచువానికి కొన్ని Complexes ఉండుట సహజము. అట్టిది వేనుడు దయ్యాలకుభయపడుట. నిజమునకు ఈ దయ్యాలభయమే వానిని లొంగదీసినది. చివరకాతడు పశ్చాత్తప్తుడైనాడు. కాని ఆ పశ్చాత్తాపము చాల ఆలస్యముగా కలిగినది. గౌతముడు వేనునిగూర్చి అనిన మాటలు పరమసత్యములు—"అన్నా! నీవంటి దివ్యపురుషులు జన్మించనే జన్మించరు. జన్మించినను, నీవంటి మహాప్రత్యేకతాలక్షణములు కలవారివలన లోకమునకు లాభములేదు" (పుట 63). నిజమునకు వేనుని జీవితసారమిదియే. శ్రీ విశ్వనాథవారు నిరూపింపదలచుకొన్నదియు ఇదియే అని భావింతును. అందుచేతనే అతడు లోకమున కెదురీత ఈది నశించినాడు.

కాని శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు ఈకథను ఇంకొకవిధముగా ఊహ చేసినారు. ఋషులు (లేదా శ్రీ విశ్వనాథవారు) వేనుని అన్యాయముగా 'ఖూనీ' చేసినట్లు తలంచి ఆ విధముగా రచన చేసినారు. శ్రీ ధనేకుల బుచ్చివేంకటకృష్ణ చౌదరిగారు వేనుని విప్లవకారునిగా భావించి ఆ విధముగా చిత్రించిఉన్నారు. లోకోభిన్నరుచిః.

వేనరాజు నాటకమంతటిలోను గౌతముని పాత్రయును, అంగరాజు పాత్రయును చాల పటిష్ఠములైనవి. గౌతముని పట్టుదలకు ఒక ఉదాహరణము :—"దీనితో నీవో నేనో తేలవల యును. నీవు సనాతనధర్మమతావలంబివైనం గావలయును. నేను నీ కఱుకత్తికి నెఱయైనం గావలయును. ఇదిగో ఈ నా చేయి చూచితివా ? ఇది

అతిమనోబుద్ధ్యహంకృతు లౌపనిషదు లాత్తగండూషితత్రయి లౌర్వవహ్ని

గర్భితాంతస్తపస్కులు ఘనుల ఋషుల, కెవ్వడువిరోధి తద్వధకెత్తినయది. (పుట 25) సూచ్యాసూచన. ధ్వని అనునవి రెండును ఈ పరాకాష్ఠను చెందిన నాటకము వేనరాజనియు, ఆ శిల్పము నర్తనశాలలోనే ప్రారంభమైనదనియు చెప్పవచ్చును.

వేనరాజును విమర్శించువారందరును అది ప్రధానముగా వేదమతస్థాపనార్థము వ్రాయ బడినదని తలంచుచున్నారు. కాని, అంతకంటె ఇంకొక రహస్య మిందుకలదు. వారి నూత్నకల్పనయగు వందుల కథలో గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్యమము స్థాపింప బడినదని తెలియవలెను. నిజమునకు వేనునిలో మార్పుతెచ్చినది వారి సత్యాగ్రహోద్యమమే. ఆ వందులు చదివిన పద్యములన్నియును వేనుని మానసికదశా పరిణామమును సూచించు చున్నవి. వానిలో నాస్తికభావము ఎంతెంతగా ప్రబలుచువచ్చినదో, అతడెటువంటిస్థితిలో ఉండు చుండెనో ఆ పద్యములు ధ్వనింపజేయుచున్నవి.

పృథువు మగవాడే, కాని మగవాడని తెలిసినచో రాజ్యలోభియై వేనుడు వానిని చంప గలడని భయపడి అంగరాజు పృథువును కుమార్తెనుగాచేసి పెంచినాడు. ఇది ఒక విచిత్రమైన కల్పనము. ఆ పృథువులో తాను స్త్రీననెడి భావము, అందులోను తాను రాజుననెడి భావము తన యొద్దకు స్త్రీ రూపమున వచ్చిన భూదేవిని చూడగానే కలిగి, వికసించినవి. భారతీయ దృష్టిలో పృథువే ఇందలి నాయకుడు.

ఈ వేనరాజు 1934 లో ఆంధ్రనాటకకళాపరిషత్ సభలలో ప్రప్రథమముగా ప్రదర్శింప బడినది. ఆనాడు శ్రీ స్థానంవారు పృథువు. గోవిందరాజుల సుబ్బారావుగారు అంగరాజు, మాధవపెద్ది వెంకట్రామయ్యగారు గౌతముడు. శ్రీ శేషాచార్యులుగారు వేనరాజు. శ్రీ విశ్వ నాథవారే స్వయముగా ఆచార్యకత్వమును వహించిరి. కాని ఆనాడది విజయవంతముకాలేదు. ఇది వైదికనాటకమని పలువురుపెద్దల విశ్వాసము. తత్ఫలముగా ఆనాడు పెద్దఅల్లరి జరిగినది. నాటకము సగములోనే ఆగిపోయినది. ఇటీవల డా. చాగంటి సన్యాసిరాజుగారు తమట్రూపుతో దీనిని నాలుగైదుసార్లు విజయవంతముగా ప్రదర్శించియున్నారు. "It is a drama written most forcibly" అని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి ప్రభృతులచే ప్రశంసలనందికొన్న నాటక మిది.

కాని ఇందొక లోపమున్నది. మొదటి భాగములో తర్క వితర్కము లెక్కువ. ఇది రంగస్థలము మీద రక్తికట్టుట కష్టము. ప్రేక్షకులు కూడ అందులకు సిద్ధపడివచ్చినప్పుడే అందలి స్వారస్యమును గ్రహింపగలరు. లేనిచో ఇట్టి నాటకములు రంగస్థలము మీద విజయ వంతము కాలేవు. తమ రూపకములన్నింటిలోను ఈ నాటకము ఉత్తమమని శ్రీ విశ్వనాథవారి అభిప్రాయము. కాని, నర్తనశాలయే నన్నెక్కువ ఆకర్షించినది.

త్రిశూలము

ఇది శ్రీ విశ్వనాథవారి నాలుగవ నాటకము. పశ్చిమ చాళుక్య ప్రభువగు తైలపదేవుడు కళ్యాణ కటకమునకు రాజు. పశ్చిమ చాళుక్యరాజు రక్తమునుండి వెచ్చదనము తొలగిపోయి రాజ్యమును నిభాయించుకోలేని స్థితిలో కాలచుర్యరాజగు బిజ్జలుడు తైలపదేవుని సంహరించి త్రిభువనమల్ల బల్లహ బిజ్జలుడను పేర సింహాసనమెక్కెను. బలదేవ దండనాయకుడు బిజ్జలుని ప్రధాని. అంతటి ధీశాలి మఱియొకఁ ఉండబోడట. స్వరాజ్యమేలిన ఆ మంత్రి చనిపోవువేళకు సంస్థానమున కింత చిల్లిగవ్వ కూడ దాచని నిస్వార్థప్రవృత్తి వానిది. బిజ్జలు డాతని ఉపకారమును తన బిడ్డబిడ్డతరాన గూడ మరచిపోలేడు. అట్టి బలదేవ దండనాయకుని మేనల్లుడే బసవడు. బలదేవునియందలి అభిమానముచే బిజ్జలుడు బసవని పిలిపించి, పూజించి మహామాత్య పదవి నొసంగినాడు. మేనమామ పోలికలు బసవనియం దుండుననియు, ఆతని వలె ఇతడును రాజనీతివేత్త అయిఉండుననియు బిజ్జలుడు తలంచెను.

అంతియేకాక బసవనికి మహామాత్యపదవి నొసంగుటలో ఇంకొక నిగూఢాశయము కూడ లేకపోలేదు. యావద్భారతదేశమును, లేదా కనీసము దక్షిణాపథమునైనను ఒక్క గొడుగు క్రిందకు తేవలయునని బిజ్జలుని ఆశయము. జగదేవు డన్నట్లుగా అతడు "సర్వ భారతైకచ్ఛత్ర మహోన్నత భావ ధీవిభవాభిరాముడు" (పుట 140). అప్పటికే బసవడు మహిమలు ప్రకటించుచు, మహాభక్తుడుగా, నందీశ్వరుని అవతారముగా ప్రసిద్ధికెక్కినాడు. అట్టివాడు తనకు మహామాత్యుడైనచో తన ఆశయు, ఆశయమునుకూడ సఫలములుకాగలవని బిజ్జలు డూహించెను. కళ్యాణకటకమును పన్నిద్దఱు మంత్రులు పాలించుచున్నారు. వారంద ఱను వేదవేదాంగవేత్తలు, నీతిశాస్త్ర కోవిదులు, యుద్ధవిద్యా నిపుణులు. ఇంక బిజ్జలునిమించిన యుద్ధ విద్యా నిపుణుడు ఆ రాజ్యమందే లేడట. అయినను "ఖడ్గ కళానైపుణ్య మేమిచేయును? ఏది చేసినను దైవమే చేయువలయును" (పుట 4) అనెడి మతమువాడు బిజ్జలుడు.

కాని బిజ్జలుడు బసవని అంతర్యమును సరిగా గ్రహించలేదు. జగదేవుడు చెప్పినట్లు బలదేవుడు "రాజును, ప్రజయు నన్యోన్యభక్తి నలరఁజేసెడు వట్టి రాజ్యాంగవేత్త"; మఱి బసవడో "నూతన విచిత్ర మార్గములను తక్కితారుచున్న మతప్రవక్త" (పుట 3). ఈ సత్యమును బిజ్జలుడు గ్రహింపలేదు. జగదేవుడు బిజ్జలునకు బాల్యమిత్రుడు; సేనాని అయినాడు. అనేక యుద్ధములను గెలిచి బిజ్జలుని రాజ్యమును విస్తృతమొనర్చినవాడు. అబద్ధమాడిఎఱుగనివాడు. మహావీరుడు. వీని దోర్బలమును, బసవని మాహాత్మ్యమును నమ్మకొనినాడు బిజ్జలుడు. చివరకు జగదేవుడే బిజ్జలుని ప్రాణములను దీసినాడు. ఇచ్చట బసవని వివేకరాహిత్యము స్పష్టమగుచున్నది. బిజ్జలుడే అన్నటు బసవడు అనూహాశాలియై జగదేవునిచే బిజ్జలుని చంపించుటచే కళ్యాణకటకము పాడువడి, బిజ్జలుని రాజ్య మొక్కటియే పోలేదు. వీరశైవమతము కూడ క్రమముగా నశించినది (పుట 148).

ఈ విషాదాంత నాటకమునకు బిజ్జలుడు నాయకుడు. అతడు ఉత్సాహము మూర్తీభవించిన ఒక మహారాజు. ఇందీతని పాత్ర అద్భుతముగా పోషింపబడినది. శ్రీ విశ్వనాథవారి పాత్రలన్నింటను నాకు ప్రీతిపాత్రమైనది బిజ్జలుని పాత్రయే.

బసవడు కేవలము మతప్రవక్త. అన్యమత-అసహిష్ణువు. రాజ్యస్థాపనకు తోడుపడుమని బిజ్జలుడు ప్రార్థించినను, అతడు మతాంతరుడనెడి ద్వేషభావ ముండుటచేతను, తనకు రాజనీతి తెలియకపోవుటచేతను బసవడు సఫలుడు కాలేకపోయెను. నాటకము విషాదాంతమగుటకు ఇదియే కారణము. కోపముతో బిజ్జలుడు మొదలగువా రొనర్చిన "శివద్రోహమునకు కళ్యాణ కటకము నశించినది. రాజద్రోహమునకు వీరశైవమతము నశించినది. చరిత్రకు శ్రీ విశ్వనాథ వారు చేసిన వ్యాఖ్యానమిది.

కాళిదాసు శృంగారమును అతిలోకముగా పోషించినాడు. వానిని మించవలెననెడి ప్రయత్నముతో భవభూతి వివిధ రస సమ్మేళనమును అద్భుతముగా నిర్వహించి, కృతకృత్యు డైనాడు. అది వానికొక్కనికే సాధ్యమైనది. శ్రీ విశ్వనాథవారు ఆ ప్రయత్నమును దృష్టిలో పెట్టుకొని ఇందు వివిధభావముల సమ్మేళనమును చక్కగా నిర్వహించినారు. ఇందు బిజ్జలుడు వీరతామూర్తి; బసవడు నిలువెల్ల భక్తిభరితుడు; ఇంక నీలమతచ్ఛాయలు కలిగిన lyrical element ఈ మూడింటిని శ్రీ విశ్వనాథవారు చక్కగా blend చేసినారు.

చారిత్రకముగా నీల (బిజ్జలుని సోదరి). బసవని భార్య అగునో కాదో సంశయము. అందుచే కవి ఆమెను భక్తురాలినిచేసి ఆత్మ సంయోగమును కల్పించినారు.

ఈ నాటకములో ఇంకొక విశేషము కలదు. Henry Esmond అనెడి నవల 19 వ శతాబ్ది నాటిది. కాని, కవి అందులో 17 వ శతాబ్దినాటి జీవితమును చిత్రించుచు, ఆ శతాబ్దిలో వాడుకలో ఉన్న భాషనే తానును ప్రయోగించియుండెను. ఇట్టి ప్రయత్నమునే శ్రీ విశ్వనాథ వారు త్రిశూలమందు చేసినారు. పాల్కురికి సోమనాథుని బసవపురాణమందలి భాష 12 వ శతాబ్దినాటిది. శ్రీ విశ్వనాథవారు అభాషనే ప్రయోగించినారు. కొన్నిచోట్ల బసవపురాణమందలి ద్విపదలను అట్లే తాము వాడుకొనినారు. మరికొన్నిచోట్ల ఆ ద్విపదలను వచనముగా మలచు కొనినారు. ఇంక తక్కినచోట్ల అట్టి భాషనే తాము వ్రాసినారు. ఇది ఒక అపూర్వమైన ప్రయత్నము; అందు వారు కృతకృత్యులైనారు.

## తల్లిలేని పిల్ల

ఇది సాంఘిక నాటకము. ఇందులో తల్లిలేనిపిల్ల వసుంధర విధవరాలు. తండ్రి భగీరథ శాస్త్రికి ఆమెఅన్నచో ప్రాణము. వసుంధరపై ప్రేమకల ఒక నాయుడుగారి కుమారుని ఆమె బి.ఏ. వరకు చదివించినారు. అతడు తండ్రి తద్దినము పెట్టననుటతో కథలో పెద్ద మార్పువచ్చి చివరకు దుఃఖాంతమైనది. శ్రీ విశ్వనాథవారు "కథ" అను పేరుతో చెప్పిన క్రింది వాక్యాలు గమనార్హములు.

"ఇది లోకములో జరుగుతున్న కథకాదు గాని సంఘము యొక్క ఒక వ్యవస్థను నిర్ణ యించడానికి ఇందులో ప్రయత్నమున్నది. అందుచేత ఇందులోని కొన్ని పాత్రలు లోకాను గుణముగా ఉండవు. ఆదర్శప్రాయముగా ఉంటవి. సాంఘిక నాటకమంటే సంఘమును యథా మాతృకంగా చిత్రించడంకన్న సంఘంలో ఉన్న దోషాలు చూపించడానికీ, దోషయుతమైన సంఘమునందు గుణాధానం చెయ్యడానికీ, ప్రయత్నించడానికి అయితే బాగుంటుందని ఊహపడి యిల్లా వ్రాయటం."

ఇందు పది అంకములున్నాయి; అనగా పది రంగములన్నమాట. దీనిని నాటకమన్నంత మాత్రమున ప్రాచీన లక్షణములకు సరిపోవునని అర్థముచేసికోరాదు. సాంఘికనాటకమనునది ఒక ఆధునిక రూపకప్రక్రియ. శ్రీ విశ్వనాథవారి నవలల ఛాయలిందు కొన్నికలవు. తక్కిన విషయము లెట్లున్నను రంగముమీద రక్తికట్టగల రూపకమిది.

## ధన్యకైలాసము

ఇందు ఆరంకములున్నవి. ఇది నాటకమనబడినది. కాని నాటకలక్షణము లిందులేవు. ఇందు ప్రకరణలక్షణములు కొన్ని కలవు. అంతియేకాక మృచ్ఛకటిక అనుకరణము లిందు కన్పించుచున్నవి. భోగేశ్వరుడనెడి వేశ్యకాముకుడు చిత్రలత అనెడి వేశ్యపన్నిన వలలోపడి చివరకు సర్వనాశనమగుట ఇందలి కథ. రచన విశ్వనాథవారి మామూలు ధోరణిలోనే నడచినది. రంగముమీద ఎంతవరకు రక్తికట్టునో తెలియదు. ఇందలి ఇతివృత్తము ఆకర్షణీయముగా లేదు; ఉదాత్తమునుకాదు. ఇట్టి నవలలనుకూడ కొన్నింటిని వారిటీవల వ్రాయుచున్నారు. ఇట్టి రచనలను చేయుట కవిసమ్రాట్టుల అర్హతకు తగినదికాదు; వీనిని మానుకొన్నచో ఆంధ్ర సాహిత్యమునకు లోపమురాదని విశ్వసించుచున్నాను.

## అంతా నాటకమే

ఇందలి ఇతివృత్తము సాంఘికము. ఇందు నాలుగు అంకము లుండుటచే కాబోలు దీనిని 'నాటిక' అనినారు. కాని ఇది కేవలము ప్రహసనముమాత్రమే. ఇందు కేశవదాసు నాయకుడు. ప్రసంగతమైన హాస్యమిందు వెల్లివిరియుచున్నది. ఆధునిక సంస్థలమీద ఇది ఒక పెద్ద విమర్శ. నాయకులమని చెప్పుకొని తిరిగేవారు, డబ్బుతో కానిపనులు చేయువారు, డబ్బు కక్కుర్తికి మోచేతులు నాకెడివారు ఇందు విమర్శింపబడినారు. ఇది మొదటిసారిగా ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు జరిపించినపోటీలలో ప్రదర్శింపబడి బహుమానమును గడించుకొన్నది. కళాశాలా విద్యార్థులు ప్రదర్శించుటకు తగిన రూపకమిది. బందరులోని నాటకసమాజమువారు కూడ విజయవంతముగా దీనిని చాలసార్లు ప్రదర్శించియున్నారట.

## కావ్య హరిశ్చంద్ర

ఇది రేడియోరూపకము. పూర్వ కావ్యములలో, ఆధునిక రూపకములలో వర్ణింపబడిన కథయే ఇందును చిత్రితమైనది. కాని ఇందు శ్రీ విశ్వనాథవారు ఒక విచిత్రమైన కల్పనము చేసినారు. హరిశ్చంద్రుడు మామూలు సత్యవాక్యతత్పరుడగు మహారాజు మాత్రమే కాదు; మోక్షమార్గగామి అయిన జీవుడు. ఆతడు అరిషడ్వర్గమును, ఈషణత్రయమును క్రమముగా జయించుట ఇందు చక్కగా నిరూపింపబడినది. మాతంగకన్యలను నిరాకరించుటలో కామమును, రాజ్యమును అర్పించుటలో లోభమును, పిశాచాదులకు భయపడకుండుటలో మోహమును, భార్య నమ్మజూపుటలో మదమును, కాలకౌశికుడు భార్య నవమానించుచున్నను చూచి ఊరకుండుటలో మాత్సర్యమును, పుత్రుని మరణము విని 'శివాజ్ఞ' అని నిర్లిప్తుడగుటలో

పుత్రేషణమును, భార్యనుచంపనుంకించుటలో దారేషణమును, చివరిసారిగా సర్వసౌఖ్యములను చేకూర్తునన్న విశ్వామిత్రుని మాటలను తిరస్కరించుటలో ధనేషణమును జయించుట ఇందు క్రమముగా నిరూపితములైనవి. ఇది ఒక అపూర్వ కల్పనము. చివరకు విశ్వామిత్రుడు "నీవరిషడ్వర్గము గెలిచితివి. ఈషణత్రయమును గెలిచితివి. నీవు జీవన్ముక్తుడవు ...నీవు శివైక దేహమవు" అని హరిశ్చంద్రుని ప్రస్తుతించెను.

## వేదహరిశ్చంద్రము

వేదములోని హరిశ్చంద్రుడు అబద్ధమాడెనని కొందరి వాదము; అదికాదని నిరూపించుటకే శ్రీ విశ్వనాథవారు వేదహరిశ్చంద్రమును రచించినారు. ఇందు రోహితుని పాటలన్నియును వేదమంత్రములకనువాదములు. ఈ పాటలన్నియును అధ్యాత్మరామాయణ కీర్తనలను లేదా త్యాగరాయ కృతులను లేదా కృష్ణలీలాతరంగిణిని అనుసరించియుండును. అసలు వీరి పాటలన్నియును ఇంతియే. కావ్య-వేద హరిశ్చంద్రములు రెండును రేడియోలో ప్రసారితములైనప్పుడు శ్రీ విశ్వనాథవారే హరిశ్చంద్ర పాత్రను ధరించినారు.

పై తెలుగు రూపకములనే కాక "అశనినిరాసము", "అమృతశర్మిష్ఠనము" అనెడి సంస్కృత రూపకములను కూడ రచించియున్నారు. వానిని నేనిప్పుడు పరిశీలించుటలేదు.

సాధారణముగా శ్రీ విశ్వనాథవారు తమ రచనలన్నింటిలోను కాలవిషయమున, కథావిషయమున సంక్షిప్తతను సాధించుటకు అనేక రకములైన శిల్పములను, చిత్రములను ప్రదర్శించుచుందురు. వీరి రచనలు సాహిత్యగౌరవము ఎక్కువగా కలవిఅగుటచేతనే ప్రదర్శనములు ప్రజాభిమానమును చూరగొనలేకపోవుచున్నవి. ప్రేక్షకులు సారస్వతద్రష్టలై, ప్రయోక్తలు క్రాంతదర్శులైనప్పుడే వారి రూపకములు రాణింపగలవు. అది కుదరనప్పుడు సాహిత్య గౌరవము తక్కువ అయిన తల్లిలేని పిల్ల. అంతా నాటకం వంటి రచనలు మాత్రమే ప్రసిద్ధిలోనికి వచ్చును.

ఇంతవరకును శ్రీ విశ్వనాథవారి రూపక పరిశీలనము నా ఓపినంత చేసియున్నాను. గుణాగుణములకు సహృదయులే ప్రమాణము. శ్రీ విశ్వనాథవారు ఉత్తమ రూపక రచయిత లనుట నిస్సందేహము. వీరి రూపకములను గూర్చి డా. దివాకర్ల అవధానిగారును, శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులు గారును "విశ్వనాథ సాహిత్య సంచిక"లో రెండు వ్యాసములు వ్రాసియున్నారు. వానిలో మరికొన్ని వివరములు కలవు.

తమ రచనల ఆనుపూర్వి మొదలగు విషయములను దయతో నాకు వివరించి చెప్పిన శ్రీ విశ్వనాథవారికిని, ఈ సదవకాశమును నా కొసంగిన రసధునీ కార్యకర్తలకును నా నమోవాకములు.



ఊహాచిత్రం :

# ఎందుకని? .... ఎక్కడికి ?

— కుమారి లావినేని హేమాదేవి

ఏడాది తర్వాత, తిరిగి పట్నం వెళుతున్నానన్న సంతోషం—ఆత్మీయులను మళ్ళా కలుసుకుంటాననే ఆనందం; కాని, ఇక్కడున్న నావాళ్ళకు దూరం కావడము బాధగానే ఉన్నది. బండి మళుపు తిరుగుతూండగా, నవ్వుతూ చెయి ఊపానన్న మాటేగాని, గుండెలో ఎంతో భారంగానే ఉన్నది. కళ్ళు నీళ్ళు తిరిగాయి....

అబ్బ! ఏమి ఈ తలనొప్పి! చంపేస్తోంది!.... మెయిల్ ఎప్పటికీ రాదా? అదేమిటో, నేనెప్పుడు పట్నం వెళ్ళినా, మెయిల్ ఇలా ఆలస్యంగానే వస్తుంది. ఐనా, ఇంత ఆలస్యమా!

ఎవరు చెప్మా: షిఫాన్ చీర, క్రొత్తరకం కత్తిరింపుమెద జాకెట్, ఏవేవో వింత నగలు, నాజూకైనవి. కాళ్ళకు ఎత్తుమడమల జోడూ, ఆమే, ఎక్కడో చూచిన మనిషిలాగే ఉన్నది. ఐనా కాదు, క్రొత్తమనిషే. పలకరిస్తే—

ఏమిటో! కొందరు మాట్లాడేది మన భాషే ఐనా, అదేదో యాసగా ఉంటుంది. ఎందుకో ఇంత తేడా! కాని, పాపము! ఎంత చప్పున చనువవుతారు కొందరు! అది వారి నైజము. వారి నలా చనువు చేసుకోవడము మన నైజమూ కాబోలు. తనని గురించి అన్నీ చెప్పివేసింది. అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ, అన్న ఉద్యోగమూ, చెల్లెలు చదువూ అన్నీ తెలియజెప్పింది. తన విషయమూ చెప్పింది. "ప్రేమ వివాహ"మట తనది. ప్రేమ....వివాహము. తనవారికి ఇష్టమేట గాని, ఆతని తలిదండ్రులు పసేమీ ఒప్పుకోలేదట. పెళ్ళయి ఏడాదైనా ఇంకా, తానింకా, అత్తామామలను చూడలేదట!

ఈ రైలు ఎప్పటికీ రాదా!

వీరెవరో పాపము! ప్లాట్‌ఫారమ్‌మీదనే కొంగు పరచుకుని నిద్రపోతున్నారు— కటికినేలమీద. ఈ రొదలో ఎలా నిదురపడుతుందో! ఏరైలుకు వెళుతున్నారో? లేపి అడుగనా?.... ఇంకా కాసేపు చూస్తాను. నే వెళ్ళే రైల్లోనే వెళుతున్నారేమో. అప్పుడే లేపితే సరి.

ఏమిటీ గోల! అటువైపు ప్లాట్‌ఫారంమీదికి ఇంకేదో రైలు వస్తోంది. జనం అటు వెళుతున్నారు. రే కూలీ! రే కూలీ! కూలీ ఐనంతమాత్రాన ఈ ఏక

వచన ప్రయోగమెందుకో ! అతనికేం ? కష్టపడి సంపాదించుకొంటున్నాడు. సంఘానికి చీడపురుగులాంటివాడు కాడు ఆ కూలీ ! స్వతంత్రజీవి. మన సామాను మోసి పావలా డబ్బులు సంపాదిస్తున్నంతమాత్రాన తండ్రి అంత వాణ్ణి "ఒరే" అంటామా ! తప్పుకాదూ !

ఆ రైల్లోదిగి ఇద్దరు అమ్మాయిలు ఇటే వస్తున్నారు. నావేపే. రెండు జడల తలలో ఇన్ని పువ్వులు ! చేతిలో ఎర్రని హాండ్‌బాగ్ ఆడించుకుంటూ ఒకరు, కష్టంతో రైలుసంచి మోస్తున్న లావుపాటి ఆమె ఒకరు. ఎవరోకాదు-కుమారి ! తనూ పట్నం వస్తోంది కాబోలు.

"మా చెల్లెలు ఈ ఏడు పట్నం వస్తోంది. పై చదువుకు" అని పరిచయం చేసింది కుమారి తన రెండు జళ్ళ చెల్లెలిని, నాకు.

ఇంతట్లోకే మెయిలు వచ్చింది. ఏక హడావుడే ! చివరికి అందరికీ చోటు ఉంటుంది. కాని, ఏక హడావుడి.... ఆ పడుకున్నవారిని లేపనా ? —ఎందుకూ, వారే లేచారు.

దిగేవాళ్ళను దిగనియ్యకుండా, కుమారి ఎలా త్రోసుకుంటూ ఎక్కుతోందో. తన రైలుసంచితో ముందుకు తోవజేసుకు పోతోంది. ఆమె వెనకాలే చెల్లెలూ. క్రిక్కిరిసిన కంపార్ట్‌మెంట్ తలుపువద్ద హోరాహోరీ యుద్ధము. ఆ ఒత్తిడికి నలిగిన చంటిబిడ్డ కెవ్వుమంది. ఉహుఁ....కుమారికి లెఖ్ఖలేదు. విరుచుకు పడు తోంది పెట్టెలో. నయం, నన్నూ తనతోటే ఆ పెట్టెలోకి రమ్మనలేదు.

ఫరవాలేదు. ఇక్కడ చోటు బాగానే ఉంది, చివరపెట్టె. ఇంతదూరం రావడానికి ఓపికలేదు ఎవరికీ, రైలు ఈ స్టేషన్‌లో అరగంట ఆగుతుందని తెలిసికూడా.

ఎప్పుడు కదులుతుందో రైలు ! రైలు వచ్చేవరకూ, రాలేదు, రాలేదని ; రైలు వచ్చాక, ఎక్కి కూర్చున్నాక, ఇంకా కదలదు, ఇంకా కదలదు—అని.

....ఊళ్ళో మాటలు జ్ఞాపకం వస్తున్నాయి. ఎల్లాగైతేనేమి, వదినే నేనూ కలిసి ఆ సీరియల్ కథ చదువడము పూర్తి చేశాము. కాని, ఏమి కథలో ఇవి. కొంతమేర అచ్చంగా జీవితంలో నిత్యమూ జరుగుతూన్న కథలాగే ఉంటుంది. కొంతమేర అభూతకల్పన. చాలావరకు మరెవరో వ్రాసినదానికి వట్టి అనుకరణ. ఒరిజనల్‌గా ఉన్నంతవరకు చాలా బాగానే నడిచింది. ముఖ్యంగా నారాయణరావు మరణమునకు సంబంధించినంతవరకు బాగా రాణించింది రచన.

శక్తి ఉండీకూడా ఒకరూ, శక్తి లేక ఒకరూ, ప్రవాహంలోపడి కొట్టుకు పోతూన్న వ్యక్తికి సాయపడలేక చూస్తున్నారు. నిస్సహాయంగా ఒడ్డుకేసి చూస్తున్నాడు, మునిగిపోతూన్న ఆ వ్యక్తి. "వారికి లేని మమత నీ కెందుకూ" అన్నట్లు పెద్ద కెరటం ఒకటి అతన్ని వీపుకి చరిచి ప్రవాహంలోకి లాక్కుపోయింది— ఆఖరి ప్రయాణంలోకి.

ఏ ప్రయాణికుడూ తిరుగిరాలేని ప్రయాణమది.

అది విధి అనాలా ? "చేసిన పాపం" అంటారేమో, ఆ బలవన్మరణానికి కారణం. కాని, మనకు తెలిసినంతవరకు అతను ఏమీ పాపము చేసినట్టులేదే. ఏమో, మనకేం తెలుసు ?

బ్రతికి ఉండగా, కోల ముక్కు, గుండ్రటి ముఖం, అందమైన నడుమూ, నాజూకైన వ్రేళ్ళూ—ఇంకా ఇలా ఎన్నో అంశాలలో అతి సుందరమైన శరీరం. క్షణంలో కట్టెగామారి, ఇంకొక్క క్షణంలో బూడిదవుతుంది. గుప్పెడు బూడిద ! అంతే.

ఇది తెలిసికూడా ఎందుకీ వ్యామోహం ?

ఎవరి జీవితపుబాటా గులాబీపూలబాట కాదని బాగా తెలుసు. కాని, ఎల్లప్పుడూ ముళ్ళే ఉండవనే నమ్మకమూ తప్పదు.

మొన్న ఎక్కడో చదివాను- తాతయ్య చదువుతూన్న "జ్ఞాన దీపిక" లో అనుకుంటాను : "ఇదంతా మాయ !" అని. అబ్బే ! మాయ ఎలా అవుతుంది ?

మంచితనం, మానవత్వం రెండూ మూర్తీభవించిన వ్యక్తులు మన యెదుట మసలుతూండగా, వారు కలిగిస్తూన్న ఆనందమంతా మాయ అని ఎలా అనుకోను? పట్నం జేరగానే అక్కా ! అంటూ ఒక్క పరుగున వచ్చి నా కాళ్ళకు బందాలు వేసుకొనే చిట్టితల్లి, "నా నీ" ప్రకటించే అనురాగము మాయ ఎలా అవుతుంది ?

కాని, ఈ ప్రేమ అంతా ఎందుకు ? ఈ ప్రయాణం చివరకు ఎక్కడికి ?

రైలు కదులుతోంది....



డాహోరూపకం

# కాళిదాసు పునరాగమనం

— శ్రీ సి. నారాయణరెడ్డి

వ్యాఖ్యాత	గుత్తులుగ వ్రేలాడు గో స్తనుల చందాన
నింగి పందిరిపైన నీరదమ్ములు వ్రేల;
కాళిదాసు హఠాత్తుగా నాకు కనిపించు,
తిన్నగా మేఘసందేశమ్ము వినిపించు.

కాళిదాసు	కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపే నాస్తంగమిత మహిమా వర్షభోగ్యేణ భర్తుః,
యక్షశ్చక్రే జనకతనయా స్నాన పుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమేషు.

వ్యాఖ్యాత	ఏమిచిత్రం. నిజంగానే ఎవరో మేఘసందేశం వినిపిస్తున్నారు.

కాళిదాసు	తస్మిన్నద్రౌ కతిచిదబలా విప్రయుక్తస్స కామీ
నీత్వామాసాన్ కనకవలయ భ్రంశరిక్త ప్రకోష్ఠః
ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయం దదర్శ.

వ్యాఖ్యాత; ఆఁ ఎవరిదా కంఠం. ఆ స్వరంలో ఎంత నిండుదనం. ఆ మధుర స్వరం నాలోని అనుభూతులకు రెక్కలు తొడుగుతున్నది. నన్ను చిత్రకూటంవైపు నడిపిస్తున్నది. కాదు. అంబరచుంబి శిఖరాలమీదికి పృథ్వికి మానదండమైన హిమాచలం మీదికి.

(వాద్య సంగీతం)

ఎవరాతడు? రత్నస్థగితమైన గిరి శృంగంపైన కూర్చున్నాడు. ఆ కనులలో నిశ్చలత్వం తపస్సు చేస్తున్నది. ఆ ముఖంలో బ్రహ్మతేజస్సు మందహాసం చేస్తున్నది. ఎవరాతడు? యక్షుడా? కాదేమో? కాళిదాసా? అవునవును. కాళిదాసే. ముమ్మాటికి కాళిదాసే.

(సన్న సన్నగా ఉరుము)

కాళిదాసు: "జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం.. ..."

వ్యాఖ్యాత: అహో! మహాకవి ఆషాఢమేఘాన్ని ఎంత ఆప్యాయంగా పలకరిస్తున్నాడు! మహాకవి మాటలు వినగానే మబ్బు ఎంతవినయంగా ముడుచుకుపోయింది. తెల్లని శిఖరంమీద నిలిచిపోయిన ఆ మబ్బుతునక విరహిణి కపోలం మీది పుట్టుమచ్చలా ఉంది.

(మళ్ళీ ఉరుము)

కాళిదాసు: "సంతప్తానాం త్వమసి శరణం...."

వ్యాఖ్యాత: అదుగో! ఎవరా దంపతులు. దూరతీరాలలో నిల్చొని వింటున్నారు. మహాకవిమాటలు విని ఆనందబాష్పాలు రాలుస్తున్నారు. అలనాడు మహాకవి మబ్బుతో పంపిన సందేశం ఈ దంపతులదేనా? సందేహంలేదు. అలనాటి యక్షదంపతులే వీరు. వాళ్లేమో మాట్లాడుకుంటున్నారు. ఇక్కడ ఒదిగి వింటాను.

(వాద్య సంగీతం)

యక్షుడు: ప్రియా! బీటలువారిన మన హృదయాలలో జీవనాన్ని వర్షించిన మహాకవి కాళిదాసు. చూస్తున్నావా?

యక్షి: చూడడమేకాదు ప్రియా! వింటున్నాను. మళ్ళీ యిన్నాళ్ళకు మహాకవి మబ్బును పలకరించినాడు. ఈనాడాతడు ఎవరికి సందేశం పంపిస్తాడో?

యక్షుడు; నిజమే చెలీ! ఈనాడు ఏ వియోగుల తపస్సు ఫలించనున్నదో? దివ్యభారతీచరణాలకు ఏ సరికొత్త కావ్యం స్వర్ణనూపురం కానున్నదో? మహాకవిని మళ్ళీ దర్శించుకోవడం మన మహాభాగ్యం. ఆయన నవసందేశాన్ని మనసారా విందాము.

(ఉరుము)

కాళిదాసు: మేఘుడా! ఎంతకాలమైనదయ్యా నిన్ను పల్కరించక. అలనాడు ఒకానొక వియోగి కన్నీటి సిరాతో నీ గుండెమీద అక్షరాలు వ్రాసినాను. నాడు నీ వొక ప్రేమలేఖ వైనావు. ఇన్నేళ్ళ తర్వాత నీతో ఇంకొక సందేశం పంపించాలనుకొంటున్నాను. వింటావు కదూ. (ఉరుము సన్నగా) కొంచెం దగ్గరగా కూర్చో. కొంచెం ఉరుము దగ్గరగా)

(మధురంగా వాద్య సంగీతం)

కాళిదాసు: నవసందేశమ్మును వింటావా!
నయనమ్ములు చెమ్మగిల్లిపోవ!! నవ॥
చివికిన గుండెలపాలిటి
నవజీవన దాతవు
ప్రతిఫలమ్ము కోరకనే
పయనించే దూతవు నవ॥

మధురబాధలను దెలిపే
మాటలు కావయ్యా - ఇవి
ప్రణయవార్తలను పంపే
దినములు కావయ్యా॥ నవ॥

తననీడను గని తానే
తడబడేటి కాలమ్మిది
తన హృదయమ్మును తానే
అనుమానించే యుగమిది॥

సుమ పరిమళాలతోడ
ఘుమఘుమలాడే వాయువు;
పొగలతోడ సెగలతోడ
భుగభుగ మండినదయ్యో॥ నవ॥

కత్తుల ఒడిలో లోకం
ఒత్తిగిల్లి పడుకొన్నది.
రూకలో తెరలో సంఘం
రూపు మార్చుకొంటున్నది॥ నవ॥

ఇన్నినాళ్లుగా పెరిగిన
ఈ విశాల భూగోళం;
పరమాణువు పిడికిలిలో
బందీయై పడియున్నది॥ నవ॥

ఎగిసిపో......చెలికాడా......ఎగిసిపో
జగమంతా శాంతిసుధలు......కురిసిపో......
ద్వేషానల మారిపోవగా
స్నేహబీజ మంకురించగా
ప్రేమలు ఫలించగా
పేదలు సుఖియించగా
ఎగిసిపో......ఎగిసిపో......ఎగిసిపో......॥
(వర్షంకురిసిన చప్పుడు-ఉరుము. వాద్య సంగీతం)

వ్యాఖ్యాత : ధన్యోస్మి. విజ్ఞానం వెర్రితలలు వేస్తున్న లోకానికి మహాకవి సందేశం వెన్ను చరుపు. అసూయలతో ఉడికిపోతున్న జగత్తుకు అమృతాభిషేకం. కవివాణి అనశ్వరం. అది ప్రతి యుగంలో ఒక కొత్త గొంతుకతో వినిపిస్తుంది, అది ఎంత సనాతనమో, అంత నూతనం. నింగిలో మేఘా లున్నంతకాలం కాళిదా సుంటాడు. మేఘమే కాళిదాసు. కాళిదాసే మేఘం.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో.)

నాటిక :

# ఆగష్టు 15

శ్రీ జొ. రమాకాంత్

పాత్రలు :

ప్రసాద్ తండ్రి - మధు : ప్రసాద్ తమ్ముడు - సుశీల : ప్రసాద్ స్నేహితురాలు - చిట్టి : ప్రసాద్ చెల్లెలు - ప్రసాద్.

[డిశంబర్ 9, 1946. ప్రసాద్ తండ్రి వార్తాపత్రిక చదువుతుంటాడు]

తండ్రి : లండన్‌లో నెహ్రూ...... ప్రధాని అట్లీతో సంప్రదింపులు... ....నెహ్రూ రాలేకపోయినా రాజ్యాంగ పరిషత్సమావేశం ఈ రోజు జరిగితీరాల్సిందే నని నాయకుల ఉద్ఘాటన....ప్రథమ అధ్యక్షుడు శ్రీ సచ్చితానంద సిన్హా.... (పత్రిక మూసేస్తూ) స్వతంత్ర సమరం....త్యాగమూ దేశసేవ, విశ్వమానవ కల్యాణము అని బంగారంవంటి నా కొడుకును ఈ కాంగ్రెస్ ఆహుతి కొన్నది....అసలు జీవించి ఉన్నాడో లేక అమరత్వం సాధించాడో! పసి కుంక!....ఎండమావుల్ని చూచి భ్రమపడి, స్వదేశాన్ని విడిచి, నిలువ తావన్నా లేక లోకసంచారం చేయవలసిన అధోగతి సంప్రాప్తించింది నీకు....(పుస్తకాల నడుమనుంచి ఉత్తరం తీస్తూ) ఇదే ఆ కొదమసింగపు తుది సందేశం ...యువకుల ఉడుకు రక్తాన్ని ఉప్పొంగించిన నాయకులు ఆ ఉద్రేకాన్ని సవ్యమైన మార్గాల్లోకి త్రిప్పలేకపోయ్యారే ...లోకంపాలు చేసారే నా ప్రసాద్‌ను. (ఉత్తరం విప్పుతాడు. ప్రసాద్ కంఠస్వరంలో ఉత్తరం వినిపిస్తే బాగుంటుంది)

"ఆగష్టు 9న ప్రారంభించిన సత్యాగ్రహాన్ని దిగ్విజయంగా కొన సాగించాం", బాల వీరుడు! "ఆ 14 తా. పోలీసులు నన్ను అరెస్ట్ చెయ్యటం ఎరుగుదువు గదా." ఔను. మ్లేచ్ఛులు; నీతి జాతి లేని మాన వాధములు; దేశద్రోహులు. "అక్కడ జైలులో నేనూ ఇంకొక ముగ్గురూ రహస్య ప్రయత్నాలు సలిపి బ్రిటిష్ ఉద్యోగుల కళ్ళల్లో దుమ్ముకొట్టి జైలు దాటేశాం. తరువాత కొంతకాలం ఆడవేషంలోనూ, లంచాలిచ్చి తప్పించు

కొని దేశం బయట బడ్డాం. సంగతంతా విస్తారంగా చెప్తా కలిసినప్పుడు" అదెప్పుడో! ఈ జీవి కంత భాగ్యం కలుగుతుందా...."అక్కడ అజాద్ హింద్ ఫౌజ్‌లో చేరాం....తరువాత సంగతులన్నీ మొన్న జరిగిన ట్రయల్ వలన తెలిసే ఉండొచ్చు....కాని బానిస దేశాన్ని విడిచివచ్చి మళ్ళీ దాన్ని ప్రవేశించడం నా అభిమతం కాదు. దేశ స్వాతంత్ర్యంకోసం మా ప్రయత్నాలు మేము సలుపుతున్నాం. త్వరలో దిగ్విజయం కలగొచ్చు.... నా దేశంలో నేను అపరాధిగా కోర్టుకి వెళ్ళటం నా స్వాభిమానానికి చిన్న తనం. స్వతంత్రభారతిలో కాని నేను అడుగుపెట్టను." ....ఎప్పుడో, పోయిన సంవత్సరం వచ్చిందీ ఉత్తరం. తన విలాసంకూడా తెలుపలేదు. ఎక్కడున్నాడో ఇప్పుడు.... "అమ్మా, చిట్టీ, మధు కులాసాగా ఉన్నారా! ....వాళ్ళను మరచికూడాపోతున్నా." దేశ స్వాతంత్ర్యం, దేశోద్ధరణ అని కలవరిస్తూ ఇంటిని మఱచిపోకేంచేస్తావ్. (గద్గదస్వరంతో) దేవా! పిచ్చి పిచ్చి భ్రమలు తొలగి, ప్రసాద్‌ను ఇంటికి వచ్చేట్టు చెయ్యి తండ్రీ.

(కొంతసేపు నిశ్శబ్దం. వెనుకనుంచి శ్లోకం వినబడుతుంది)

'మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుద్ధస్వగతజ్వరః.'

(శ్రీ భగవద్గీత)

[ మధు ప్రవేశిస్తాడు ]

మధు : నాన్నా నాన్నా. పిచ్చిది, పిచ్చిదొచ్చింది చూడు.

తండ్రి : పోనీరా.

మధు : కాదు నాన్నా, నువ్వు కావాలిట దానికి.

తండ్రి : నేనా!

మధు : ఔన్నాన్నా!.... పేరుపెట్టడుగుతుంటేను!

తండ్రి : ఇట్లా రమ్మను చూద్దాం. (సుశీల ప్రవేశిస్తుంది)

సుశీల : నమస్కారం. (కొంత చనువుగా, చిలిపిగా నవ్వుతుంది)

తండ్రి : న....మ....స్కా....రం.

సుశీల : గుర్తుపట్టలే దనుకొంటా....నా పేరు సుశీల.

తండ్రి : ఊ....సుశీల!....సుశీ నువ్వా.... నువ్వా!.... సుశీ! అయ్యో! అట్లా మారిపొయ్యావేం....నా ప్రసాద్ ఏడి సుశీ, ఏడీ నా కన్నతండ్రి, చెప్పూ.

సుశీల : శాంతించండి. ప్రసాద్ క్షేమంగానే ఉన్నాడు ... ఆయన సందేశాన్నే తీసికొచ్చా.

తండ్రి : అట్లా చిక్కి శల్యమై యున్నావేం సుశీ!....ఏమన్నాడు ప్రసాద్? వాణ్ణి తీసుకురాలేదేం,

సుశీల : రమ్మని బ్రతిమాలా. కాని బానిసదేశపు దుమ్ము తొక్కనని శపథం పట్టాడు. స్వాతంత్ర్యోదయం కాకముందు ప్రసాద్ రాడు.

తండ్రి : మందభాగ్యుడు.... కులాసాగా ఉన్నాడా నా కుఱ్ఱతండ్రి... గుట్టల్లోనో అడవుల్లోనో ఏ ఆకో కాయో తిని బతుకుతున్నాడా. మేమిక్కడ సుఖంగా కాలక్షేపం చేస్తూంటే... స్వతంత్రసమరం నడిపిన యోధులు, యోధాగ్రేసరులు కడుపుల్లో చల్ల కదలకుండ మంత్రిపదవుల నాక్రమించుకొంటే, దేశ స్వాతంత్ర మోనని నీ కర్మమిట్లా పట్టిందేంరా...నీ పెంకెమితం ఏ విధంగా స్వతంత్రసిద్ధికి తోడ్పడుతుందిరా నాయనా... ఎక్కడున్నాడు సుశీ మా అబ్బాయ్?

సుశీల : బర్మాలో.

తండ్రి : అక్కడేం చేస్తూంటాడంట.

సుశీల : అదంతా పరమరహస్యం తండ్రీ...మా ఉద్యమం సఫలమైతే మా త్యాగ సేవ లోకానికి చాటుతాం. లేకపోతే మమ్మల్ని మఱచిన లోకంలో శాశ్వతంగా మాపేరు వినబడకుండా చేస్తాం.

తండ్రి : అంటే.

సుశీల : అంటే చెప్పటం కష్టతరం....మా కిప్పటికి పదకొండు దేశాల్లో ఆఫీసులున్నై. వివిధ మార్గాలద్వారా బ్రిటిష్ పరిపాలన కంతరాయాలు కల్పించి భారతదేశంమీద పట్టుతొలగింపచేస్తాం. అటువంటి పరిస్థితులు సృష్టిస్తాం. హిందూదేశంలో ఆంగ్లేయుల మంతనాలు, రాయబారాలు వెయ్యికండ్లతో విమర్శించి దేశనాయకులకు తెలుపుతూ ఉంటాం. ఈమధ్య విలాసరహితంగా అందిన ఉత్తరాలు మావే....విదేశాల్లోనుంచి పని కష్టంగా ఉంది. అందుకు నన్నిక్కడికి పంపారు.

తండ్రి : ఎక్కడుంటావ్ సుశీ నువ్వు?

సుశీల : ఈ సంగతులన్నీ చెప్పకూడనివి తండ్రీ...వీలైతే అప్పుడప్పుడు వచ్చి చూసి పోతూంటా. ప్రసాద్ అడ్రస్‌కూడ రహస్యంగానే ఉంచాలి. అది నా విధి.

తండ్రి : ...ఇప్పుడు పరిపాలన మన దేశనాయకులదేగద సుశీ, ఈ సహాస్యం దేనికంట.

సుశీల : వాళ్ళపద్ధతులు సక్రమమైనవనిగాని, అవసరమైనవనిగాని తలచరు. స్వదేశంలో ఉండే కృషి సలపాలని వాళ్ళ దృఢవిశ్వాసం. ఎట్లాగయినాసరే శీఘ్రంగా స్వరాజ్యం రావాలని మా కాంక్ష...సరే నే నిక వెళ్ళొస్తా.

తండ్రి : వెళ్తావా సుశీ!...అయ్యో. ప్రసాద్‌ని చూచినట్లే ఉంది సుశీ నిన్ను చూస్తే...మా ఇంట్లోనే ఉండరాదూ.

సుశీల : కాదుకాదు...దానికి చాల ఇబ్బందులున్నై...ఇంకా చాల పనులున్నై. నాకు శలవియ్యండి.

తండ్రి : అయ్యో తల్లి! భోజనమైనా చేసిపో. ఆ మాసి జీర్ణించిపోయిన బట్ట లేమిటి. మంచివిస్తా కట్టుకుపో.

సుశీల : అది అవసరంబాబూ...భోజనాని కేమొచ్చెకాని వెళ్తా—

తండ్రి : కాదు సుశీ. భోజనం చెయ్యంది కదలడానికి వీల్లేదు. నా కొడుకు శుభవార్త తీసుకొచ్చిన నిన్ను మా యింట్లో ఒక్క పూటైనా ఉండకుండా పంపిస్తానా.

సుశీల : మీరట్లా అంటే నేనేమనేది. సరే త్వరగా కానీండి. లేకపోతే ప్రమాదం.

## 2

[అగష్ట్ 9 1947. వెనుకనుండి ఉపన్యాసము వినిపించును.]

'నేడు భారతదేశ స్వాతంత్ర్యసమర చరిత్రలో మరువరాని దినం. ప్రపంచ చరిత్రలో స్వర్ణాక్షరాలతో దిద్దబడే దినం. ఈనాడు భారతదేశపు అవిచ్ఛిన్నశక్తి యావద్భారతమావహించి బ్రిటిష్‌పరిపాలకులను భయకంపితుల చేసింది. దేశనాయకుల విప్లవనినాదం ప్రతి స్వేచ్ఛాలాలసుల హృదయాల్లో విద్యుత్తుగా వెలిగి లోకాన్ని తేజోభూతం చేసింది. బాలురు, విద్యార్థులు, కర్షకులు, కార్మికులు, ప్రభుత్వోద్యోగులు. వనితలు, వయోవృద్ధులు స్వతంత్రసమరంలో ప్రాణాలను తృణప్రాయంగా బలిచేసారు. 'భారతదేశం భారతీయులది, మా దేశాన్ని వదలిపొండి' అని గుండె నిబ్బరంతో తుపాకిగుండ్ల నెదుర్కొని, జైలుయాత్రలకు లోనై, అనేక కిరాతకాలకు గురియై భారత ప్రజానీకం లోకానికి తన శక్తిని స్వాతంత్ర్యేచ్ఛని చాటింది. నిరూపించింది. ఒప్పించింది. బ్రిటిష్ కుటిలత రుజువుచేసింది. మనకు నేటికికాని వాటి ఫలితం లభించలేదు. ఈ 15 తా. భారతదేశం స్వతంత్రతను బడయగలదు....

తండ్రి : స్వతంత్రత...(చదువుతున్న పత్రిక నలిపేస్తూ), ఈ స్వతంత్రతతోనే నా కొంప తీసారు. ఆనాడు ఆగస్టు 10 తారీకు. ఆ హడావుడంతా చూస్తే స్వాతంత్ర్యం వచ్చినట్లుగానే ఉంది. నా కళ్ళకి మైకం కమ్మింది. నాయకుల ఆదేశానుసారం విప్లవకార్యక్రమం కొనసాగించటం పరమవిధని తోచింది. కాని దాని ఫలితంగా నా కన్నకొడుకును అర్పించుకోవాలని ఎరుగక గడ్డి తిన్నా. ఆనాడే వాడిని ఆపిఉంటే, ఈ ముప్పు రాకపొయ్యేదిగదా...ఎట్లా ఉన్నాడో... సుశీ నువ్వు కూడా రానేలేదే మళ్ళీ... అబ్బ! నే నేం పాపం చేసాను దేవా! ఈ బాధపడడానికి ? (మధు ప్రవేశిస్తాడు.)

మధు : నాన్నా నాన్నా...ఈరోజు మా బడిలో గొప్ప ఉత్సవం చేస్తారుట నాన్నా! ఆగస్టుయోధుల వీరత్యాగ చిహ్నంగా దేశమంతట ఈనాడు సభలు, సమావేశాలు, ఊరేగింపులు జరుపుతారట...ఏంచేసారు నాన్నా అస లీనాడు ?

తండ్రి : (యధాలాపంగా)... ఆనాటి వీరవిప్లవ నినాదం ప్రళయ గాంభీర్యంతో ప్రతి భారతీయుని హృదయాన్ని తబ్బిబ్బుచేసింది. భారతదేశాన్ని విడిచి పొండిఅన్న సింహగర్జన ఆంగ్లప్రభుత్వంగుండెల్లో రైళ్లు పరుగెత్తించింది. శాంతిసమర నేత గాంధీమహాత్ముని ఆదేశానుసారం దేశమంతట వీరావేశం ప్రజ్వరిల్లింది. పరదేశీయ పరిపాలన అంతరింపచెయ్యాలని ప్రతి పౌరుడు దృఢనిశ్చయం చేసికొన్నాడు. పరిపాలనా చక్రాన్ని అన్ని దిక్కులనుండి ఆపివేసారు, పోస్టు టెలిగ్రాఫాఫీసులు ధ్వంసంచేసారు. ఉద్యోగాలకు రాజీనామా లిచ్చారు...ఆ రోజు ఏడేండ్ల కూన 'మోటార్ ఆపు' అని రోడ్డుకడ్డంగా నుంచుంటే, ఆ హృదయంలేని పోలీస్, వాడిని నడిబజార్లో పడేసి ఈడ్చుకుపోయాడు. నా మనస్సట్టే తరుక్కుపోయింది. ఈ చేతుల్తోనే ఆ పోలీస్ చెంపలు వాయించి, శరవేగంతో పోతున్న కారుక్రిందకి తోసేసా.

మధు : చంపేసావా? నాన్నా!

తండ్రి : లేదు తండ్రీ! వా డాసుపత్రిలో కోలుకొన్నాడు... ఈ కిరాతకులకు దయా దాక్షిణ్యాలు చూపకూడదు. పశుతుల్యులు, దేశాభిమానం మానవత్వం నశించిన జీవచ్ఛవాలు. వాళ్లేకాదు, ఇంకా ఎందరో అటువంటి దేశద్రోహం చేసారు. నిరపరాధుల్ని ప్రభుత్వాని కప్పచెప్పారు. చెప్పరాని హింసలకు గురిచేసారు... ఆ రోజుల్లోనే అన్నయ్యను పట్టుకెళ్ళారు.

మధు : నిన్నెందుకు పట్టుకెళ్ళలా మరి ?

తండ్రి : అదే వాళ్ళ పొరపాటు... 13 తారీకు వీధులన్నీ చూచా. ఆనాటిదాక నేనూ నాకు తోచినరీతి విధి నెరవేరుస్తున్నా. వీధులన్నీ అరాచకంగా నిర్మానుష్యంగా బావురుమంటున్నై. అక్కడక్కడ చిమ్మిన రక్తపు ఎఱ్ఱని చికిలిముగ్గులు తెగిపోయిన తీగెలు, కూలిన స్తంభాలతో భయంకరంగా ఉండింది. ఆరోజే నేను పోలీసువాణ్ని కొట్టింది. ఆ దెబ్బతో నా దిమ్మ తిరిగింది. పచ్చి నెత్తురు నిండుప్రాణంనుంచి చిమ్మటం నేను సహించలేక పోయినా. శాంతియుతసమరానికి కావలసిన నిగ్రహము నిబ్బరము నాకింక అలవడలేదని గుర్తించా. పశ్చాత్తాపపడ్డా. ఆనాడల్లా ఏ పని తోచలా. రాత్రి నిద్రకూడ పట్టలా... తెల్లవారిందో లేదో నా కన్నతండ్రి నరెస్టు చేశారని తెలిసింది. నిలువునా నీరైపోయినా. కాని భారతదేశం గుర్తొచ్చింది. మానవధర్మం నెరవేర్చాంగదా అన్న వీరానందంతో నన్ను నేనే మఱచి పోయినా...శాశ్వతంగా నా ప్రసాద్‌ను పోగొట్టుకొంటున్నా నని నాకేం తెలుసు...

మధు : ఎక్కడున్నాడు నాన్నా, అన్నయ్య ?

తండ్రి : అన్నయ్యా...ఉన్నాడు తండ్రీ ఎక్కడో...స్వతంత్రసమరం అన్నయ్య మధూ...అన్నయ్యను మఱచిపోవాలి తండ్రీ...

[అప్పటికి దూరాన్నించి వినిపిస్తున్నపాట, మెల్లమెల్లగా స్ఫుటంగా వినబడుతుంది]

అఖిల భారతజాతి నిదుర మేల్కాంచెనోయ్
స్వాతంత్ర్య సాధనకు ప్రతిన ప్రకటించెనోయ్
భారతీయుల శక్తి బ్రహ్మాండమంతదోయ్
పరిపాలనా కుటిలతలు సాగనేరవోయ్
సత్యమును గుర్తించి తొలగిపొండోయ్
ధర్మమని గుర్తించి తప్పుకొండోయ్
దేశ స్వాతంత్ర్యంబు మా జన్మ హక్కోయ్
దేశ స్వాతంత్ర్యంబు మా జన్మ హక్కోయ్
జన్మ హక్కోయ్...

['పోస్టుమాన్' అని కేక వినబడుతుంది. కొంతసేపటికి మధు ప్రవేశిస్తాడు ఉత్తరంతో]

మధు : నాన్నా! నాన్నా! ఉత్తరం.

తండ్రి : (ఉత్తరం విప్పుతూ) ఎవరు. ప్రసాదే. నా కన్నతండ్రి మళ్ళీ రాసాడూ, నా బంగరుతండ్రి.

'నాన్నా, మా ప్రయత్నాలన్నీ విఫలమైనై. మా బ్రాంచస్ డిసాల్వ్ చేసికొన్నాం. ఇక మా కర్తవ్య మేమిటో నిర్ణయించుకోలేదు. రేపో మాపో ఇక్కడ సమావేశం జరుగబోతున్నది. దాని తరువాత గాని నా భవిష్యత్తు తెలియదు. నా కోసం మీరు దిగులేం పడకండి. మీ క్షేమసమాచారాలు సుశీవల్ల తెలుసుకొంటున్నా.

తండ్రి : 'మధు మధుః అన్న యుత్తరం రాసాడు చూశావా' అన్నయ్య రాసాడురా. అమ్మని పిలు, చిట్టిని పిలు, ప్రసాద్ ఉత్తరం రాసాడు. ప్రసాద్ ఉత్తరం....

## 2

[ఆగష్టు 15, 1947. దూరాన్నించి మొదలుపెట్టిన పాట మెల్లమెల్లగా స్ఫుటంగా వినబడుతుంది.]

జయ జయ జయ జయ జయ భారత
ప్రతిభాయుత అమర వినుత,
జయ సదమల శాంతి నియత,
జయ లోక నిరంతర నేతా. ॥ జయ ॥

తండ్రి : (కఱ్ఱతో నేలని కొడుతూ) జయ, జయ, జయ....(పాట సన్నగిల్లుతుంది. వికటంగా నవ్వుతాడు. ఇంతలో చిట్టి ప్రవేశిస్తుంది)

చిట్టి : నాన్నా, నాన్నా, ఊరేగింపుకు రావా నాన్నా.

తండ్రి : ఊరేగింపుకా, నేన్దేనికే.

చిట్టి : అదేమిటి నాన్నా అంతా వెళ్ళుతుంటే నువ్వు రానంటావ్....ఇంగ్లీషువాళ్ళెళ్ళిపోతార్ట నాన్నా. ఇవ్వాళ్ళే దేశానికంత గొప్ప పండుగట.

తండ్రి : మనకేం పండుగే తల్లీ ?

చిట్టి : ఏం ?

తండ్రి : మీ పెద్దన్నయ్యేడీ ?

చిట్టి : అబ్బః పో నాన్నా ! ఎప్పుడూ పెద్దన్నయ్యే నంటావ్. వస్తాడులే నాన్నా. ....ఊరంతా ఎంత బాగ అలంకరించారనుకున్నావ్....చూద్దాం రా నాన్నా !

తండ్రి : నేను రాలేను...ఆనాటి ముచ్చట్లన్నీ జ్ఞాపకమొస్తే. నేను రాలేను... నువ్వు పోతల్లీ.

చిట్టి : నే నొక్కత్తెనేనా ?

తండ్రి : మధుతో చెప్తాలే తీసికెళ్ళమని...మా అమ్మగా...

చిట్టి : రావా నాన్నా.

తండ్రి : అసలీ రోజేమిటంట స్వాతంత్ర్య దినం. రాక రాక ఇదీ ఆగష్టులోనే రావాలీ ?......ఆగష్టు భారతదేశ చరిత్రలో విషాదకరమైన సంఘటన లెన్నిటినో తెచ్చింది.

చిట్టి ఏం నాన్నా ?

తండ్రి : (యధాలాపంగా)......'స్వాతంత్రం నా జన్మహక్కు దాన్ని నేను సాధిస్తాన'ని ప్రప్రథమంగా, ఉద్ఘాటించిన మహాపురుషుడు లోకమాన్య తిలక్, ఆగిష్టు మొదటి తారీకే దివంగతుడయ్యాడు. తరువాత ఆగష్టు 7 న లోకపూజ్యుడు భారతీయ విజ్ఞానోద్ధరణకు జీవితం ధారవోసిన విశ్వకవి రవీంద్రు డస్తమించాడు...ఆ ఆగష్టువిప్లవపు విగతజీవులు సంఖ్యకు మీరి యున్నారు....అప్పుడే ప్రసాద్‌నుకూడా విధి బలాత్కారంగా వేరుచేసింది... అటువంటి అగష్టా దొరికిం దీ స్వతంత్ర దినానికి...

చిట్టి నేనెళ్తా నాన్నా. [చిట్టి నిష్క్రమిస్తుంది. వీథిలో బాజాలు, బజంత్రీలు, ఊరేగింపులు, నినాదాలు గగ్గోలుగా వినబడుతూంటై. ప్రసాద్‌తండ్రి దీర్ఘంగా శ్వాసవదలి, గట్టిగా ఒక్క కుర్చీలో చతికిలపడతాడు. ఇంతలో ఒక్క పెట్టున జయజయధ్వనులు చెలరేగుతై. ఎవరో హడావుడిగా లోపలికి ప్రవేశిస్తారు. తలుపు మూసేస్తాడు. బయట గల్లంతు వినబడదు.]

తండ్రి : ఎవరు....ప్రసాద్ !...నువ్వేనా ప్రసాద్ ! వచ్చావా !...అబ్బ ! ఎంత కాలానిక్కనబడ్డావురా...బజారువైపు చూచిచూచి కళ్లు చిల్లులుపడ్డయిరా.

ప్రసాద్ : వచ్చా నాన్నా చివరికి. ఏదోరకంగా దేశవిచ్ఛిన్నం జరిగినా స్వాతంత్రం మటుకు వచ్చింది. యావద్భారతమూ ఏకంగా త్రివర్ణపతాకం క్రిందనే ఉండాలని విశ్వప్రయత్నం చేసాం. సాధ్యపడలా నాన్నా.

తండ్రి ఏదేమన్నా కానీ; నువ్వొచ్చావు నాయనా. నాకింకేకొదువా లేదు. నువ్వే నా స్వాతంత్ర్యము. నువ్వే నా సర్వస్వము. నీకోసమే నేను జీవించి ఉన్నా. నువ్వు లేనిదే చావునుకూడా ఎదిరించా తండ్రీ. ఏ జన్మలో చేసికొన్న పుణ్యమో నిన్ను మళ్ళీ చూచేభాగ్యం కలిగింది...నిన్ను చూడగల

నసే నమ్మకం ఉంటూండసే వుండేది...కాని ఆబాధ దుస్సహం...ఎట్లా ఉండేవాడివిరా నాయనా నువ్వు !

ప్రసాద్ : నాన్నా! నిన్నువిడిచి నేనుమటుకు ఉండగలనా....కాని నిన్ను నన్ను బంధించే ప్రేమపాశాలకన్నా బలవత్తరమైన కర్తవ్యం నన్నీడ్చుకు పోయింది. నా ప్రయత్నం నేను చేసా. నా ధర్మం నేను నిర్వర్తించా. స్వసౌఖ్యం త్యాగం చేసా. ఇదంతా దేశంకోసం, నా స్వదేశంకోసం,.... నా మాతృదేశంకోసం....

తండ్రి : ఎక్కడున్నావురా నాయనా ఇంతకాలం ? ఉత్తరాలన్నా వ్రాయలేక పోయావేం ?

ప్రసాద్ ; వీల్లేకపోయింది నాన్నా....ఆ రెండు ఉత్తరాలు అతికష్టంమీద చేర్చా నల్లా. నేను తిరగని దేశంలేదు. తిరిగితిరిగి పరిస్థితులన్నీ పూర్తిగా అవగాహన చేసికొన్నా. 1945 లోనే తెలిసిపోయింది ; బ్రిటిష్ పరిపాలన అంత్యదశ కొచ్చిందని. బ్రిటన్ ఆర్థికపరిస్థితి దీనికి మూలకారణం. మా కృషి ఏకైక స్వతంత్రభారతానికి సలిపాం. విఫలమైంది.

తండ్రి : ఆ ప్రయత్నాలన్నీ ఇక్కడే ఉండి చేస్తే ఏ దేవుడు కాదన్నాడురా నాయనా !

ప్రసాద్ : ఒకసారి తప్పించుకుపోయి మళ్ళీ ఈ బానిసదేశానికే రమ్మంటావా నాన్నా. ఇవ్వాళ్ళే భారతదేశం పరదాస్యశృంఖలాలు తెగతెంచుకోగల్గింది. మళ్లీ నా మాతృదేశం రాగల్గిం దివ్వాళ్ళే...పిల్ల లేరీ ?

తండ్రి : ఊరేగింపు చూడ్డాని కెళ్ళారు.

ప్రసాద్ : నావల్ల మీకు కలిగిన బాధలకు, దుఃఖానికి క్షమించు నాన్నా, విధిగా చెయ్యాల్సొచ్చింది. (మధు, చిట్టి ప్రవేశిస్తారు.)

మధు : నాన్నా నాన్నా యివ్వాళ్ళే— (ప్రసాద్‌ను చూచి వెంటనే ఆగిపోతాడు) అన్నయ్యా ! ఎప్పు డొచ్చావ్!!

ప్రసాద్ : ఇప్పుడే.

చిట్టి : అన్నయ్యొచ్చాడూ...అన్నయ్యొచ్చాడు...నేం చెప్పలా వస్తా డని. (సుశీల ప్రవేశిస్తుంది)

తండ్రి : ఓ చెప్పకేం, చెప్పావమ్మా...

ప్రసాద్ : సుశీ ! బాగున్నావా ?

సుశీల : ఇదేం. (చిరునవ్వు)

[దూరాన్నుంచి మళ్ళీ పాట వినబడుతూంటుంది 'జయ...']

తంత్రి : జై స్వతంత్రభారత్. (పాట స్వరం హెచ్చుతూంటుంది)

సుశీల : జై హింద్.

ప్రసాద్ : జై మాతృభూమి.

[అందరూ పాటందుకొని పాడుతారు]

జయజయ జయజయ జయభారత, ప్రతిభాయుత అమరవినుత
జయసదమల శాంతినియత, జయలోక నిరంతరనేతా ॥జయ॥

స్వేచ్ఛాజీవుల స్వతంత్రసమరా
విజయనినాదం నేడుగదా !
భారతజాతీ దాస్యశ్శృంఖల
నేడుగదా తెగత్రెంచినదీ ! ॥జయ॥

దేశసేవయే పరమధర్మమని
దేశవిమోచనే జీవితపథమని
దేశోద్ధరణే నిజమగు మతమని
విదేశ కిరాతక క్రూరానలంలో
సమసిరి భారత వీరప్రవరులు ! !
స్వేచ్ఛాభారతి హారతిగొనరే
దివ్యదృష్టిన గనరే మనవిజయం. ॥జయ॥

నిత్యసౌభాగ్య త్రివర్ణపతాకా !
సత్యజ్ఞాన ప్రదాతా ! లోకనుతా ! ॥జయ॥



పుస్తక సమీక్ష :

# జయంతి

(సాహిత్య మాస పత్రిక)

ప్రాప్తిస్థానం :
౫౧౬, సుల్తానుబజార్,
హైదరాబాదు.

వార్షిక చందా రు ౮-౦౦
ఒకే ప్రతి ౦-౭౫ న.పై.

తెలుగుభాషలో సాహిత్యమాసపత్రికల సంఖ్య చాలా తక్కువగా ఉన్నది. భారతదేశంలోని ఇతర భాషలతో పోల్చి చూచినట్లయితే మన భాష ఈ రంగంలో చాలా వెనుకబడి ఉన్నదని చెప్పక తప్పదు.

తెలుగుభాషలో ఇప్పుడిప్పుడే ౨-౩ మాస పత్రికల ప్రచురణ ప్రారంభమైనది. ఇది చాలా సంతోషించవలసిన విషయం. జయంతి పత్రిక మొదటి సంచిక మా కార్యాలయానికి చేరినది. ఈ పేరుతో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ఇదివరలో కొంతకాలం పత్రికను నడిపించి తెలుగు సాహిత్యమునకు చాలా ఉపకారంచేసి ఉన్నారు. అదేపేరుతో తిరిగి పత్రిక వెలువడడం, శ్రీ సత్యనారాయణగారు సంపాదకవర్గంలో ఉండడం ఆనందించవలసినవిషయం.

జయంతి మొదటి సంచికలో శ్రీయుతులు విశ్వనాథ, రమణారెడ్డి, దివాకర్ల, మల్లంపల్లి వీరేశ్వరశర్మ, శండిల గార్ల వ్యాసాలు; సంపత్కుమార, మధునాపంతుల, సోమసుందర్ గార్ల కావ్య ఖండికలు మొదలగు రచనలు ఉన్నవి. ఇవన్నీ పాఠకులు శ్రద్ధగా చదవతగినవి. దేవులపల్లివారిని గురించి శ్రీ రమణారెడ్డిగారు వెలువరించిన భావాలతో అందరూ ఏకీభవించగలరని అనుకోను. "తెలుగుసామెతల గన్న చిన్నకథలు" అన్న వ్యాసం ప్రత్యేకంగా పేర్కొనదగినది.

సంపాదకీయంలో కొన్ని ముఖ్యమైన సమస్యలు చర్చించబడినవి. తెలుగు ఛందస్సులోనూ, రచనా విధానంలోనూ "వ్యవస్థ" నిర్మింపబడాలనీ అందుకు జయంతి ప్రయత్నిస్తుందనీ సంపాదకులు అంటున్నారు. ఈ విషయంలో ఎంత వరకు వీరు కృతకృత్యులుకాగలరో చూడవలసి ఉన్నది.

— శర్మ.

## హోమ్ సినిమా ప్రొజెక్టర్

మీ ఇంటి వద్దనే చేత్తో మోసుకొని వెళ్ళడానికి వీలయిన ఈ పోర్టబుల్ ప్రొజెక్టర్‌తో సినిమాను చూసి ఆనందించండి. టార్చి లేక విద్యుఃచ్ఛక్తితో దీన్ని పనిచేయించవచ్చు. మామూలు 35 మి. మీ. ఫిలిమ్‌ను ఇందులో ఉపయోగించవచ్చు. 4'×4' పూర్తి సైజులో తెరమీద వర్ణచిత్రాలు, సంఘటనలు, నృత్యాలు వాటంతటవే చలిస్తూఉంటాయి. 10 అడుగుల ఫిలిమ్, నడిపే విధానం, సచిత్రంగా తెలిపే కరపత్రం ఉచితం. స్పెషల్ డీలక్స్ రకం రు. 15-50. వి. పి. చార్జీలు రు. 4-50. అదనపు ఫిలిమ్ గజానికి 0-50 నయాపైసలు. రిఫైన్డ్ స్క్రీన్ రూ. 3.



## (డీలక్స్) ఆటోమేటిక్ యాభైగుండ్ల పిస్టల్

### (లైసెన్సు అక్కరలేదు)

ఆటోమేటిక్ యాభైగుండ్ల రిపీటెడ్ దయల్‌తో అమర్చబడిన ఈ అమెరికన్ పిస్టలు పెద్దధ్వని, మంటలు కల్గించి దోపిడిగాళ్ళనూ, అడవి మృగాలనూ పారద్రోలుతుంది. సినిమా, డ్రామా నటులకు చాలాఅవసరం శత్రువుల బారి నుండి రక్షించటంలో గొప్ప సహాయకారి. ఖరీదు రు. 10-50. వి. పి. చార్జీలు రు. 2-50 25 గుండ్లు ఉచితం. అదనపు గుండ్లు డజన్ రు. 1. మేలైన పిస్టల్ కేసు ఒక్కొక్కటి రు. 3-00 రిపేరుచేయుటానికి ప్యూయల్ ఆయిల్ రు. 1.




*సాంకేతిక పుస్తకాలు:* మీకు సంపూర్ణ సంతృప్తిని ఇచ్చే హామీ ఇవ్వగలం

ఎలక్ట్రిక్ అండ్ రేడియో గైడ్: రు. 15 లతో మీరు స్వయంగా రేడియోను తయారుచేసుకోండి. రేడియో రిపేరీ, వైరింగ్, విద్యుచ్ఛక్తికి సంబంధించిన సమస్తమూ 117 బొమ్మలతో బోధించే ఈ సరికొత్త ప్రచురణ వెల రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

భాషా బోధిని: జాపనీస్, చైనీస్, తమిళం, మలయాళం, బెంగాలీ, జర్మనీ ఇత్యాది దేశ విదేశ భాషలు నేర్పించే ఈ పుస్తకం ఖరీదు రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

*దర్జీపని కట్టింగ్* రు. 4. *సబ్బుల తయారీ* రు. 3. *ఫోటోగ్రఫీకళ* రు. 3. *సుహాసనవస్తువుల తయారీ* రు. 1-50. *ఒకనెలలోనే హిందీనేర్చుకోండి* రు. 4.

1 నుండి 3 పుస్తకాలవరకు వి.పి. చార్జీలు రు. 1-25] [ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులోనే

**Globe - Traders (S. H. 110) Aligarh (INDIA)**